PARLE




**పాపిన్స్ ఇప్పుడు సొగసైన కొత్త ప్యాక్‌లో.**

ఇది నిజం పిల్లలు! మీ అభిమాన పార్లె పాపిన్స్ ప్యాక్‌ని స్మార్ట్, మెరుగైన, మరింత ఆరోగ్యవంతమైన ప్యాక్‌లో పొందండి. ట్విన్ వ్రాపింగ్ కేండీస్‌ని తాజాగా మరియు రుచికరంగా ఉంచుతుంది, ఎంతో కాలం. ఇంకా, లోపల మీరు మరియు మీ స్నేహితులు ఆనందంలో మునిగిపోయేందుకు అదే పళ్ల రుచితో అద్వితీయమైన కలర్లలో పొందుతారు. ఈ కొత్త స్మార్ట్ ప్యాక్‌ని మీ పక్కలోగల స్టోర్‌లో పొందండి.






*MRP incl. of all taxes for net weight 18g

BSA LADYBIRD
Your best friend for life.




Get used to the tantalizing taste of freedom.

There's no greater feeling than having the wind in your hair, the open road beneath your feet. With a ladybird, freedom is yours. So make the most of it and enjoy every moment!

www.ticyclesindia.com

# ఈ సంచికలో...



చందమామ సంపుటి: 63 ఆగస్ట్ 2010 సంచిక: 8













**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.



T

# మార్పుకోసం స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపుకుందాం!

ఈ నెల 15న మనం స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపుకుంటాము. మన దేశం 1947లో స్వంతంత్రత పొందింది. బ్రిటిష్ రాజ్ బంధనాలనుంచి మనం విముక్తి పొంది ఇప్పటికి 63 సంవత్సరాలయింది కనుక, ఇప్పుడు నిజమైన ప్రశ్న తలెత్తుతోంది, ''మనం విముక్తిని మరియు స్వాంతత్ర్యాన్ని దాని నిజమైన అర్థంలో పొందగలిగామా?''

మనం పలు రంగాల్లో అభివృద్ధి చెందాము కాని ఇది సరిపోదు. మనం ఇంకా చాలా దూరం ప్రయాణించవలసి ఉంది. మనది పలు వైరుధ్యాలు కలిగిన దేశం. ఒకవైపు మనం చంద్రుడిపైకి ఉపగ్రహాన్ని పంపించగలుగుతుండగా మరోవైపు ఆహారం, నీరు, అందరికీ విద్య వంటి ప్రాథమిక అవసరాలను కూడా కల్పించలేకపోతున్నాము. అయితే దేశ భవిష్యత్తు మాత్రం ప్రకాశవంతంగా ఉంది. మనం నిరంతరం ఆశావహ దృక్పథంతో ఉంటూ దేశాభివృద్ధికి మన శక్తియుక్తులను సమర్పించాలి.

ఈ నెలలోనే మనం రక్షాబంధనం జరుపుకుంటున్నాము. ఇది సోదరీ సోదరుల మధ్య బంధాలను దృఢపర్చుకోవలసిన సమయం. మన సోదరీ సోదరుల మధ్య ప్రేమను కొనసాగిస్తూనే, మీరు ఒకరిపై ఒకరు ఎంత ప్రేమానురాగాలతో ఉంటున్నారో ప్రదర్శించడానికి కూడా ఇదే మంచి తరుణం.

ప్రాంతీయ భాషల్లో చందమామ సైజు ఈ నెలనుండి మారబోతోంది. మాకు లభ్యమవుతున్న కాగితం సైజు మరియు ధరవరలను ప్రాతిపదికగా తీసుకుని పత్రిక సైజును హేతుబద్ధం చేస్తున్నాం. అయితే పత్రికలో ఇచ్చే విషయాన్ని మాత్రం తగ్గించలేదు. నిజం చెప్పాలంటే పాఠకుడికి ఆసక్తికరమైన విషయం అందించడానికి మేము పత్రిక పుటలను మరో ఎనిమిది పుటల మేరకు పెంచి అందించబోతున్నాము. పత్రిక సైజును మార్చాలనే మా నిర్ణయాన్ని మీరు అభినందిస్తారనే ఆశిస్తున్నాము.

ఆహ్లాదంతో నిండిన ఈ నెలను మీరూ ఆస్వాదించగలరు. – సంపాదకుడు




ఆగస్ట్ 2010 Rs. 20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher:**
Prashant Mulekar
**Associate Editors:**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor:**
Patricia Pandian
**Content Head - Online:**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist:**
Venki
**Creative Writer:**
R. Rama
**Layout Designer:**
K. Narendra Raju
**Production In-charge:**
Prashant Pawar
**Circulation:**
e-mail: circulation@chandamama.com
**Head - Sales and Circulation:**
Sanjay B Thorat
**Manager - Sales & Circulation:**
AB Sairam
**Manager - Sales & Circulation (West & North):**
Vinay K Brid
**Asst. Manager - Sales & Circulation (East):**
Subhankar Rej
**Sales Officer - Circulation:**
K. Ravishankar
**Advertisement:**
e-mail : sales@chandamama.com
**Subscription:**
e-mail: Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2829
Jalpa Doshi (Mumbai)
Ph: +91 22 2831 2872/2831 1849
**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు



జూన్‌నెలలో వచ్చిన నా బేతాళ కథ 'ప్రతీకార వాంఛ'కు చెక్‌తో పాటు చందమామ ప్రతి కూడా పంపారు. కృతజ్ఞతలు. మొత్తంగా చూస్తే పత్రిక నిరాశ కలిగించింది. నిజంగా చందమామ ఇప్పుడో ఎక్కల పుస్తకంలాగుంది. గతంలో పత్రిక సైజు బావుండేది. పత్రిక సైజు తగ్గించడం వెనుక మీకు ఎదురవుతున్న సాంకేతిక సమస్యలు ఏమిటి? – కె. రోహిణీప్రసాద్, ముంబై

మీరు మిమ్మల్ని పొగిడేవారి ఉత్తరాలకే విలువ ఇస్తారు. ప్రజాభిప్రాయాన్ని నిక్కచ్చిగా రాసే వారి ఉత్తరాలకు విలువ ఇవ్వరు. అది లోక సహజమనుకోండి. శిథిలాలయం సీరియల్ పునర్ముద్రణ అందరికీ సంతోషం కలిగించింది. చిత్రాగారి చిత్రాలను మళ్లీ చూసి ఆనందించే భాగ్యం కలిగింది. అలాగే రూపధరుడి సాహస యాత్రలు కూడా ముద్రిస్తే చాలా బావుంటుంది. మీ పాత రచయితలమీద మాత్రమే ఆధారపడితే పత్రిక హిల్ ట్రైన్ లాగా ముందుకు సాగదు. కొత్తవారు పంపే మంచి కథలను కూడా ఆదరించండి. శివరామ్‌ప్రసాద్ గారి బేతాళ కథ 'నిజమైన చదువు' బావుంది. – ఎ. సుధ, గుడివాడ

కథ, కథనం, సాహిత్యం చందమామకు ఆయువు పట్టు. గతంతో పోలిస్తే చందమామ భాష స్థాయి తగ్గింది. మన దేశ వ్యవహారాలపై శాస్త్రీయ శోధన, సత్య పరిశోధన జరిపి చందమామను తీర్చిదిద్దితే ఇంకను వంద సంవత్సరాలు నిత్య నూతనంగా శోభిల్లగలదని నా ప్రగాఢ విశ్వాసం.
– తాళ్లూరి శక్తిరాజు, హైదరాబాద్

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://telugu.chandamama.com**

Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamama.com & subscribe Now!!**



**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..............................................................................

Date of Birth: ................................ Sex :....................................

Address: ..............................................................................

..............................................................................

..............................................................................

..................................................... City: ....................................

State:.................................... Pin:....................................

Telephone:..............................................................................

Mobile:..............................................................................

Email:..............................................................................

Subscription Number (for renewals):........................................

Gift Subscription to the following address:

..............................................................................

..............................................................................

..............................................................................

..............................................................................

Enclosed Cheque/DD* for Rupees.........................................

Cheque/DD No ..............................................................

favouring Chandamama India Ltd on.........................................

..............................................................................bank.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.



# అనర్హుడు



కోసల రాజధానీ నగరానికి సమీపంలోని ఒక అరణ్యంలో, విమలానందుడనే ముని గురుకులం నడుపుతూ, విద్యార్థులకు విద్యాదానం చేస్తూండేవాడు.

ఆయన వద్ద తర్క, మీమాంస, వ్యాకరణ, ఇంద్రజాలం లాంటి శాస్త్రాల్లో ఉద్దండులైన పండితులుండేవారు. సుదూర ప్రాంతాల నుంచి కూడా చాలా మంది విద్యార్థులు శిక్షణ కోసం గురుకులానికి వస్తూ ఉండేవారు.

ఆయన గురుకులంలో విద్యనభ్యసించాలని, నగరం నుంచి సుదాసు, మోహనుడు, అనే కుర్రవాళ్లిద్దరు బయలుదేరారు వాళ్లు గురుకులం చేరి, విమలానందుడి దర్శనం చేసుకుని, తాము వచ్చిన పని చెప్పారు.

విమలానందుడు వాళ్లకు వసతి చూపించి, ''ముందుగా మీ ఇద్దరూ ఎలాంటి శాస్త్రవిద్య నేర్చుకునేందుకు అర్హులో తెలుసుకోవలసి వుంది. దానికి కొద్ది కాలం పడుతుంది. ఈ లోపల గురుకుల నియమాలను పాటిస్తూ, ఇక్కడే వుండండి.'' అన్నాడు.

ఒక వారం గడిచింది. ఆ రోజు గురుకులానికి అవసరం అయిన కట్టెలు కొట్టుకు రావలసిన పని సుదాసు, మోహనులపై పడింది. వాళ్లు చెరొక గొడ్డలి తీసుకుని ఎండిన చెట్లకోసం వెతుకుతూ, అరణ్యంలో చాలా దూరం పోయారు.

ఒకచోట వాళ్లకు ఎండిపోయిన చెట్టొకటి కనిపించింది. ఇద్దరూ కలిసి ఆ చెట్టును పడగొట్టి, దాన్ని చిన్న కట్టెలుగా నరక సాగారు.

ఆ సమయంలో వాళ్లకు చెట్టుబోదె మధ్యలో ఒక బంగారు కాసుల మూట కనిపించింది. దాన్ని చూస్తూనే మోహనుడి కళ్లు మిలమిలా మెరిశాయి. వాడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి,

గుంటక సాంబిరెడ్డి

‘‘సుదాసూ, ఈ రోజుతో మన దారిద్ర్యం తీరిపోయినట్లే! ఈ బంగారాన్ని ఇద్దరం చెరిసగం పంచుకుందాం. దానితో ఇళ్లూ, భూములూ కొనుక్కుని, జీవితాంతం వైభవంగా బతకవచ్చు. ఇక మనం కష్టపడి చదువు నేర్వవలసిన అవసరం లేదు. ఎంత చదువుకున్నా, అది డబ్బు సంపాదించి సుఖపడడానికే గదా! ఈ ధనం తీసుకుని తిన్నగా ఇంటికి పోదాం. ఇక గురుకులానికి పోవలసిన అవసరం కూడా లేదు.’’ అన్నాడు.

సుదాసు, ఆ మాటలకు అయిష్టంగా తలాడించి, ‘‘మనం విద్య నేర్చుకోవడానికి వచ్చాం. విద్య కేవలం ధనం సంపాయించడానికే కాదు! ధన సంపాదనకు అనేక మార్గాలున్నవి. ధనం ద్వారా విద్య సంపాయించలేం గాని, విద్య ద్వారా తర్వాత ధనం సంపాదించుకోవచ్చు...

...అనుకోకుండా లభిస్తున్న ఈ ధనం, అనుకోకుండానే మన దగ్గిర నుంచి పోవచ్చు. కాని, మనం నేర్చిన విద్య ఎన్నటికీ మనలను వదిలిపోదు. గురుకుల నియమాల ప్రకారం, ఈ బంగారాన్ని తీసుకుపోయి గురువుగారికి ఇవ్వాలి,’’ అన్నాడు.

మోహనుడికి ఈ మాటలు ఏమాత్రం రుచించలేదు. వాడు బంగారాన్ని ఎంచి రెండు భాగాలు చేసి, ఒక భాగం సుదాసు కిచ్చాడు. తరవాత తనవంతు బంగారాన్ని చొక్కా లోపల బయటకు కనబడకుండా భద్రంగా దాచుకున్నాడు. తరువాత



సుదాసుతో, ‘‘నేను ఇంటికి వెళ్లిపోతున్నాను. నీవు గురుకులానికి తిరిగి వెళ్లి, నీ ఇష్టం వచ్చిన విద్య నేర్చుకో,’’ అని తిన్నగా ఇంటిదారి పట్టాడు.

దారిలో వాడు ఒక చిన్న సెలయేరు దాటవలసి వచ్చింది. అందులో దిగి వాడు నాలుగడుగులు వేయగానే, కాళ్లకేదో చుట్టుకున్నట్లనిపించింది. మరుక్షణం కుడికాలి చీలమండ దగ్గిర గట్టిగా సూదులతో పొడిచినట్లయింది.

మోహనుడి గుండె గుభేలుమనగా భయకంపితుడైపోయి వెనక్కు తిరిగి కాలును గట్టిగా విదిలించాడు. దానితో పెద్ద పామొకటి ఒడ్డున పడి, దాపులనే ఉన్న పొదలలోకి చర్రున పరిగెత్తింది.

వాడు ఒడ్డు మీదికి వచ్చి, కాలిని పరీక్షగా చూశాడు. కాలి చీలమండ దగ్గర పాము కోరలు దిగినట్లు అతి స్పష్టంగా కనిపించింది.

దానితో వాడికి ప్రాణభయం పట్టుకు న్నది. సహాయం కోసం గట్టిగా కేకలు వేస్తూ, సెలయేటి ఒడ్డునే అటూ ఇటూ పరిగెత్తసాగాడు.

మోహనుడు అలా కొంత దూరం పరిగెత్తేసరికి, ఎదురుగా ఒక ఆటవికుడు రావడం కంటపడింది. వాడు, ఆటవికు డిని సమీపించి, ''నన్ను పాము కరిచింది. నీ దగ్గర పాముకాటుకేమన్నా మందు న్నదా?'' అని అడిగాడు.

''పాము కాటుకు వైద్యం చేయడం అనేది, మా ఇంట తరతరాలుగా వస్తున్న విద్య. నేను మందు వేసి, నీ ప్రాణాలు పోకుండా తప్పక కాపాడుతాను. అయితే అందుకు ప్రతిఫలంగా నువ్వు చొక్కాలో దాచుకున్న బంగారమంతా ఇవ్వాలి. నీకు ఇష్టమేనా?'' అని అడిగాడు ఆట వికుడు.

తన చొక్కాలోపల దాచిన బంగారం సంగతి, ఇంత త్వరగా ఈ ఆటవికుడికి ఎలా తెలిసిందని, మోహనుడు ఒక్క సారిగా అచ్చెరువు చెందాడు.

అప్పటికే వాడి నోటినుంచి నురుగు వస్తున్నది. కళ్లు బైర్లు కమ్ముతున్నాయి. బంగారం చేతుల్లోంచి జారిపోయే ప్రమా దముందని తెలుస్తున్నప్పటికీ ముందు తన ప్రాణం కాపాడుకోవడం ముఖ్యం కాబట్టి, వాడు మారు పలకకుండా దాచు కున్న బంగారాన్ని గత్యంతరం లేనిస్థితిలో ఆటవికుడికి ఇచ్చాడు.

బంగారం చేతచిక్కిన వెంటనే ఆటవి కుడు అక్కడ వున్న పొదలలోకి పోయి, మూలికా గుణం ఉన్న ఏవో ఆకులు తెచ్చి, వాటి రసం మోహనుడి నోట్లోనూ, ముక్కులోనూ పిండాడు.

ఆ మరుక్షణం మోహనుడికి పాము



కరిచిన లక్షణాలన్నీ మటుమాయమ యిపై. తర్వాత ఆటవికుడు చిన్నగా నవ్వు కుంటూ అరణ్యంలో తన దారినపడి ఎటో వెళ్లిపోయాడు.

సులువుగా దొరికిన అంత బంగారం అంతే సులువుగా చేజారి పోయినందుకు మోహనుడికి ఎక్కడలేని దిగులు కలి గింది.

అయినా ఇక చేసేదేమీ లేదని బోధప డింది. వాడు కొంచెం సేపు ఆలోచించి, ఎటూ బంగారం పోయింది కనక, మళ్ళీ గురుకులంలో విద్య అయినా నేర్వవచ్చు నుకుంటూ, విచారంగా గురుకులానికి తిరిగి వెళ్లాడు.

మోహనుడిని చూస్తూనే, విమలా నందముని, ''నీకూ, సుదాసుకూ తెలియ కుండా మీ ఇద్దరికీ ఒక చిన్న పరీక్ష పెట్టాను. అందులో సుదాసు నెగ్గాడు. అతడిని గురుకులంలో చేర్చుకున్నాను. బంగారం కంటపడిన క్షణకాలం లోనే కర్తవ్యాన్ని పూర్తిగా విస్మరించిన నీవు, ఈ గురుకులంలో ఎలాంటి శాస్త్రవిద్యలు నేర్పేందుకూ అర్హుడివి కావు. ఇక వచ్చిన దారినే ఇంటికి తిరిగిపో,'' అన్నాడు.

వాడు నిరాశతో తలవంచుకుని అక్కడ నుంచి బయలుదేరాడు. గురుకులం బయట చెట్లకిందికి వచ్చేసరికి, అంతకు ముందు తనకు పాముకాటుకు వైద్యం చేసిన ఆటవికుడు కనిపించాడు.

ఆటవికుడిని చూస్తూనే మోహనుడికి ఒక సందేహం కలిగింది. వాడు అక్కడ వున్న విద్యార్థినొకడిని పలిచి ఆ ఆట వికుడు ఎవరిని అడిగాడు.

అందుకు సమాధానంగా ఆ విద్యార్థి, ''ఆయన ఆటవికుడు కాదు. కోరితే విద్యార్థులకు ఇంద్రజాలిక విద్య నేర్పే ఆచార్యుడు. ఈ రోజు ఆటవికుడి వేషం ధరించాడు.'' అని చెప్పాడు.

ఆ జవాబు వింటూనే మోహనుడు వంగి, తన కుడికాలి చీలమండ మీద పాము కరిచిన గుర్తుల కోసం చూసుకు న్నాడు. అక్కడ అలాంటివేమీ కనిపించ లేదు. దానితో వాడికి విమలానందుడి పరీక్ష ఏమిటో సులువుగా అర్థమైంది.





# సజ్జనసాంగత్యం!



మొగలిపట్టు గ్రామంలోని పెద్ద రైతుల్లో రామయ్య ఒకడు. ఆయనది పెద్ద లోగిలి. నలుగురన్నదమ్ములు కలిసికట్టుగా జీవిస్తూ, ఉమ్మడిగా కట్టుకున్న ఆ పెద్ద ఇంటి లోగిలి, ప్రతి సాయంత్రమూ పిల్లల ఆటపాటలతో కోలాహలంగా వుంటుంది. అన్నదమ్ముల పిల్లలతో పాటు చుట్టుపక్కలవారి పిల్లలు కూడా అక్కడికి వస్తూంటారు.

ఒక రోజు సూర్యాస్తమయమై చీకటి కమ్ముకుంటున్న వేళలో, వీధి గుమ్మంలో గుర్రపు బండి ఆగిన శబ్దం విని, పిల్లలందరూ కుతూహలంగా తొంగి చూశారు. అప్పటికే వీధి అరుగు మీద కూర్చునివున్న రామయ్య, అతని పెద్ద తమ్ముడు, బండి లోంచి దిగిన వృద్ధురాలికి ఎదురు వెళ్ళి, ''బాగున్నావా, పెద్దమ్మా?'' అని పలకరిస్తున్నారు.

ఆమెను చూడగానే పిల్లల ముఖాలు ఆనందంతో వెలిగిపోయాయి. ''బామ్మ వచ్చింది! బామ్మ వచ్చింది!'' అంటూ సంబరంగా ఆమెను చుట్టుముట్టారు. ఈ బామ్మ, రామయ్యకు పెద్దతల్లి అయిన సావిత్రమ్మ, అక్కడికి నాలుగు కోసుల దూరంలోవున్న రేపల్లెలో వుంటుంది. ఆమెకు రామయ్య కుటుంబంతో, ముఖ్యంగా పిల్లలతో అనుబంధం చాలా చిక్కనైంది. ఆమె చెప్పే రకరకాల కథలు వింటున్నంత సేపూ పిల్లలకు మరోధ్యాస అంటూ వుండదు.

రాత్రి అయింది. పిల్లలంతా భోజనాలు ముగించి నాలుగిళ్ళ వాకిట్లో చేరారు. బామ్మ, రామయ్య చిన్నకొడుకు పదేళ్ళ గోపీ కేసి చూసి, ''ఏమిట్రా గోపీ, మోచేతికి కట్టు కట్టావు?'' అని అడిగింది.

ఆ ప్రశ్నకు గోపీ ఏదో చెప్పబోయేంతలో, రామయ్య భార్య కల్పించుకుని, ''మరేం లేదు అత్తయ్యా! వీడు పాఠశాలలో ప్రతి ఆకతాయి వెధవతోనూ స్నేహం చేస్తూంటాడు. ఏదో సమయంలో కీచులాట జరిగి, ఇలా దెబ్బలు తిని ఇంటికొస్తూంటాడు,'' అన్నది.

అప్పుడు బామ్మ, గోపీని దగ్గరకు తీసుకుంటూ, ''వీడూ ఆకతాయే అయుంటాడు.

శ్రీలలిత

ఆకతాయి అయితే తప్ప, మరొక ఆకతాయితో స్నేహం కుదరదు!'' అని, ''ఒరే, గోపీ, అన్నిటికన్నా ఉత్తమమైనది సజ్జన సాంగత్యం - అంటే మంచివాళ్ళతో స్నేహం అన్నమాట.

అలాంటి సజ్జనసాంగత్యాన్ని గురించి ఒక కథ చెబుతాను, అందరూ వినండి,'' అంటూ ఇలా చెప్పసాగింది:

పూర్వం రామాపురంలో ఒక పెద్ద భూస్వామి వుండేవాడు, ఆయన పరమ ధార్మికుడు; దయాపరుడు. ఆయనకు శ్రీకాంతుడనే కొడుకు వుండేవాడు. ఆ కుర్రవాడు తండ్రికి తగిన కొడుకులాగే ప్రవర్తిస్తూ, పిన్నవయసులోనే మంచిపేరు తెచ్చుకున్నాడు.

అదే ఊళ్ళో రాజయ్య అనే రైతువుండేవాడు. సోమయ్య అతడి కొడుకు. తండ్రి కష్టజీవి, సోమయ్యకు పనంటే చిరాకు. అయితే, ఎంత దుడుకువాడైనప్పటికీ, చదువంటే చాలా ఆసక్తివుండేది. అందుచేత, రాజయ్య కొడుకును ఊళ్ళో నారాయణా చార్యులనే గురువు నడిపే పాఠశాలకు పంపించడం ప్రారంభించాడు.

ఆ పాఠశాలకు సోమయ్య ఈడువాడే అయిన శ్రీకాంతుడు కూడా వస్తూండేవాడు. వాడు సోమయ్యతో గౌరవంగా, స్నేహంగా మాట్లాడేవాడు. కాని సోమయ్య మాత్రం దుడుకుగా, పొగరుగా ప్రవర్తించేవాడు.

కొన్నాళ్ళకు శ్రీకాంతుడు, సోమయ్య ఇద్దరూ, ఆచార్యుల వద్ద విద్యాభ్యాసం ముగించారు. శ్రీకాంతుడు తదుపరి విద్య కోసం, అక్కడికి రెండు కోసుల దూరంలోవున్న జమీందారుగారి పెద్ద పాఠశాలకు



వెళ్ళ సాగాడు. రాజయ్య, శ్రీకాంతుడి తండ్రిని అర్థించి, తన కొడుకు కూడా శ్రీకాంతుడితో కలిసి బండిలో వెళ్ళివచ్చేలా ఏర్పాటు చేశాడు.

ఒక నాడు సోమయ్య, తనతో కలిసి చదువుతున్న జమీందారుగారబ్బాయి రాజు మీద దూరం నుంచి ఆకతాయితనంగా రాయి విసిరాడు. రాయి ఆ కుర్రవాడి తలకు తగిలి రక్తం రాసాగింది. జరిగింది వింటూనే ప్రధానోపాధ్యాయుడితో సహా విద్యార్థులందరూ ఒక్క పరుగున రాజు దగ్గరకు వెళ్ళారు.

ప్రధానోపాధ్యాయుడు విష్ణుశర్మ, వైద్యుడి కోసం కబురు పంపి, ఎవరో తెచ్చియిచ్చిన తడిగుడ్డను రాజు గాయం మీద నొక్కిపట్టుకుని, విద్యార్థులవైపు చూస్తూ, ''ఎవరు రాజు మీద రాయివిసిరింది? విద్యార్థి అయి వుండీ ఇంత దుందుడుకుగా ప్రవర్తించిన, ఆ మూర్ఖుడెవరు?'' అంటూ తీవ్రంగా ప్రశ్నించాడు.

అది వింటూనే సోమయ్య బిక్కచచ్చి పోయాడు. ఇంతలో ఒకరిద్దరు కుర్ర వాళ్ళు, సోమయ్య దూరంనుంచి రాయి విసరటం తాము చూశామని, ఆయనకు చెప్పారు.

ఆ మాటలు వింటూనే విష్ణుశర్మ ఆశ్చ ర్యంగా, ''సోమయ్య మన శ్రీకాంతుడి స్నేహితుడు. వాడు ఇలాంటి పని ఎందుకు చేస్తాడు?'' అన్నాడు.

గురువు ఇలా అనగానే, సోమయ్యకు, శ్రీకాంతుడి మంచితనమూ, తన నీచస్వభా వమూ తెలిసివచ్చి, కళ్ళల్లో నీళ్ళు తిరి గాయి.

అది గమనించిన విష్ణుశర్మ, వాడు రాయిని విసిరాడని చెప్పిన పిల్లలతో, ''చూశారా, నేనింకా ఏమీ అనకుండానే సోమయ్య ఎలా బాధపడుతున్నాడో! ఇంకె ప్పుడూ చూసీ చూడని మాటలు చెప్ప కండి,'' అన్నాడు.

ఆ మరుక్షణమే రాజు, సోమయ్య వైపు స్నేహంగా చూస్తూ, ''సోమయ్య, శ్రీకాంతు డికే కాదు, నాకూ స్నేహితుడే. వాడిలాంటి కొంటెపనులు చెయ్యడు,'' అన్నాడు.

ఇది విన్న సోమయ్య నెమ్మదిగా విష్ణు శర్మను సమీపించి, తలవంచుకుని, ''గురువు గారూ! రాజు మీద రాయి విసిరింది నేనే. రాజు, శ్రీకాంతులిద్దరూ మంచివాళ్ళు గనక, నన్ను నిర్దోషిగా చెబుతున్నారు. నన్ను శిక్షించండి!'' అన్నాడు.

విష్ణుశర్మ, సోమయ్య ప్రవర్తనకు ఆనం దిస్తూ ఏదో అనేలోగా రాజు, శ్రీకాంతు లిద్దరూ, ''గురువుగారూ! రాయి విసిరింది సోమయ్యే అని మాకూ తెలుసు. కాని, చేసిన తప్పుకు వాడు పశ్చాత్తాప పడుతు న్నాడని గమనించి, మేం సోమయ్య నిర్దోషి అని చెప్పాం. వాణ్ణి శిక్షించకండి,'' అన్నారు.

విష్ణుశర్మ వాళ్ళు చెప్పిన దానికి చాలా సంతోషించి, సోమయ్యతో, ''ఒరే, ఈ క్షణంలో నీకు సజ్జనసాంగత్యం లభించింది. ఎంత అదృష్టవంతుడివి!'' అన్నాడు.

కథ ముగించిన బామ్మ, ''పిల్లలూ! సజ్జనసాంగత్యం చేస్తే ఎలావుంటుందో మీక్కూడా తెలిసివచ్చిందా?'' అన్నది.

పిల్లలంతా ఆనందంగా, ''ఓ, బాగా తెలిసింది, బామ్మా! ఇక నుంచి మేంకూడా మంచి వాళ్ళతోనే స్నేహం చేస్తాం,'' అన్నారు.



## బేతాళ కథలు

# రాజు-దొంగ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రి సమయంలో భీతి కొలిపే ఈ శ్మశానం లో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే అమిత ఆశ్చర్యంతో పాటు, ఏదైనా అనుకోకుండా జరిగిన అవమాన కళం కాన్ని తొలగించుకోవడానికో, కప్పిపుచ్చు కోవడానికో ఇలా శ్రమపడుతున్నావేమో అన్న అనుమానం కూడా కలుగుతున్నది. మంచికని వెళితే, పరిస్థితుల కారణంగా ఒక్కొక్కసారి చెడు కూడా ఎదురవుతూ ఉంటుంది. అలాంటి సంఘటనను అవ మానంగా భావించి, దానిని బయటపడ నీయకుండా కాపాడుకోవడానికి కొందరు మితిమించిన జాగ్రత్తలు తీసుకుంటూ ఉంటారు. సామాన్యులకన్నా ఉన్నత స్థితిలో ఉన్నవారి విషయంలో ఇది



మరింత ఎక్కువగా కనిపిస్తుంది. దీనికి ఉదాహరణగా తాను ఒక దొంగ చేతులలో మోసపోయిన సంగతి బయటపడకూడదన్న తపనతో, ఆ దొంగ పట్ల చెప్పవలసిన తీర్పునే మార్చి చెప్పిన రాజు సునీలుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

దయానందముని గురుకులంలో విద్యనభ్యసిస్తూన్న రాజు సుధీరవర్మ కుమారుడు సునీలుడు త్వరితగతిలో సకల విద్యలలోనూ ఆరితేరాడు. దయానందముని ఒకనాడు సునీలుణ్ణి చేర బిలిచి, ''విద్యార్జన పట్ల నువ్వు చూపిన ఆసక్తి, చేసిన నిర్విరామ కృషి కడు ప్రశంసనీయం.

ఈనాటితో నీ విద్యాభ్యాసం పూర్తవుతున్నది. మానవులుగా జన్మించిన ప్రతి ఒక్కరికీ విద్య నయనద్వయం వంటిది. రాజ్యపాలనలో నీకిది మరింత ఉపయోగకరంగా ఉండగలదు. అధికారంలో వున్నవారు వివేకంతో తీసుకునే నిర్ణయాల ద్వారా లబ్ధిపొందేవారు ఎక్కువగా ఉంటారుగనక, పాలకులకు విద్య మరింత ఉపకారి కాగలదు. మరొక్క విషయం. సకల విద్యల పరమార్థమే కాదు; మానవ జన్మ పరమార్థమే పరోపకారం అన్న పరమ సత్యం నువ్వు కలలో కూడా మరిచిపోకూడదు. అదే నువ్వు నాకిచ్చే నిజమైన గురుదక్షిణ కాగలదు,'' అని ఆశీర్వదించాడు.

సునీలుడు గురువుకు భక్తితో నమస్కరించి, గురుకులాశ్రమ అభివృద్ధి కోసం, తండ్రి పంపిన కానుకలను ఆయనకు సమర్పించి, భటులతో కలిసి రాజధానికి బయలుదేరాడు.

షోడశ కళలతో శోభిల్లుతూన్న నిండు చంద్రుడిలా విద్యాశోభతో తిరిగి వచ్చిన కుమారుణ్ణి చూసి, రాజు సుధీరవర్మ పరమానందం చెందాడు. మంత్రులనూ, రాజగురువునూ సంప్రదించి, ఒక శుభ ముహూర్తాన సునీలుడికి ఘనంగా రాజ్య పట్టాభిషేకం చేశాడు.

సునీలుడు తండ్రిని మించిన తనయుడిలా ప్రజారంజకంగా రాజ్యపాలన చేయ సాగాడు. గురుకులం నుంచి బయలుదేరినప్పుడు గురువు చెప్పిన మాటలు ఆయన మనసులో నిరంతరం మారుమోగసాగాయి. అందువల్ల ఆయన తరచూ మారువేషంలో దేశాటన చేస్తూ, ప్రజల స్థితిగతులను, సమస్యలను ప్రత్య

క్షుంగా తెలుసుకుని పరిష్కార మార్గాలు చూపసాగాడు. ఆపదలో ఉన్నవారిని స్వయంగా వెళ్ళి ఆదుకోవడంలో పరమానందం చెందేవాడు.

ఒకనాడాయన బట్టల వ్యాపారి వేషంలో దేశాటనకు బయలుదేరాడు. రాజధానీ నగరానికి కొద్ది దూరంలో తూరుపున ప్రవహించే నదికి ఆవలి తీరంలో వున్న అటవీ ప్రదేశంలోని ఒక గ్రామాన్ని సమీపిస్తూండగా, హఠాత్తుగా వెనక నుంచి దభీమన్న శబ్దం, వెనువెంటనే, ''అయ్యా, నా బిడ్డను కాపాడండి, నా బిడ్డను కాపాడండి,'' అన్న ఆర్తనాదం విని, వెనక్కు తిరిగి చూశాడు.

ఒక మనిషి చేతులెత్తి మొక్కుతూ, ఒక పాడుపడ్డ బావిగట్టున, ''అయ్యా, నా బిడ్డ బావిలో పడిపోయాడు. అవిటివాణ్ణి. బావిలోకి దిగలేను. నా బిడ్డను కాపాడండి. కాపాడండి,'' అని అతి దీనంగా విలపిస్తూ వేడుకున్నాడు.

మారువేషంలో వున్న సునీలుడు, బట్టల మూటను గట్టున దించి, బావిలోకి తొంగి చూసి, అందులోకి దూకాడు. బావంతా కలయ తిరిగాడు. చాలాసేపు వెతికాడు. కానీ బిడ్డ జాడ తెలియలేదు. ఆశ్చర్యంతో, అతి కష్టం మీద విరిగిన మెట్లగుండా పైకి ఎక్కివచ్చాడు. గట్టు మీద అవిటివాడూ లేడు; తను దించి వెళ్ళిన బట్టలమూటా కనిపించలేదు. ఏదో బండరాతిని బావిలోకి వేసి, బిడ్డపడిపోయాడని వాడు చెబితే, తను విని మోస



పోయానని రాజు గ్రహించాడు. మరేం చేయడానికీ లేక విచారంతో రాజధానికి తిరిగి వచ్చాడు. పది రోజులు గడిచాయి. పదకొండో రోజు సునీలుడు కొలువు తీరివుండగా, నగర రక్షక భటులు ఒక దొంగను పెడరెక్కలు విరిచికట్టి, సభలోకి తీసుకువచ్చారు.

రాజు వాణ్ణి పరిశీలనగా చూసి, తల పంకిస్తూ, ''వాడు చేసిన నేరం ఏమిటి?'' అని అడిగాడు.

''నగల వ్యాపారి పుణ్యగుప్తుడి ఇంటికి కన్నం వేస్తూ పట్టుబడ్డాడు, ప్రభూ,'' అన్నారు భటులు.

''అలాగా!'' అని రాజు కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''ఈ రాత్రికి వాణ్ణి చెరసాలలో బంధించండి. శిక్ష ఏమిటో రేపు విధిస్తాను,'' అని ఆజ్ఞాపించాడు.

భటులు దొంగను అక్కణ్ణించి అవతలికి లాక్కువెళ్ళారు.



ఆనాటి అర్ధరాత్రి సమయంలో రాజు బట్టల వ్యాపారి వేషం వేసుకుని, చెర సాలకు వెళ్ళి, కునికి పాట్లు పడుతూన్న దొంగను తట్టి లేపాడు.

దొంగ ఉలిక్కి పడిలేచి, ''నువ్వు ఇక్క డికెలా వచ్చావు? నువ్వూ దొంగవేనా?'' అని రాజును అడిగాడు ఆశ్చర్యంగా.

రాజు ముఖానికి పెట్టుకున్న గడ్డాన్నీ, తలపాగానూ తీసి పక్కన పెట్టాడు. అంతే, దొంగ ప్రాణభయంతో గడగడ వణు కుతూ, ''క్షమించండి, ప్రభూ! మిమ్మల్నే మోసం చేసి మీ బట్టల మూటను కాజే శాను. ఇకపై అలాంటి పనులు చేయను. నన్ను రక్షించండి, రక్షించండి,'' అంటూ రాజు పాదాలపై పడ్డాడు.

''తప్పు చేసినవాడు శిక్ష అనుభవించ వలసిందే! వ్యాపారి ఇంట దొంగతనానికి ఒడిగట్టిన నిన్ను శిక్షించక తప్పదు. దానికి తగ్గ శిక్ష రేపు విధిస్తాను. నన్ను మోసగించిన నేరాన్ని క్షమించి వదిలిపెడతాను. అయితే, బావిగట్టున ఆ రోజు జరిగిన సంగతి నువ్వు మరెక్కడా చెప్పకోకూడదు. సరేనా?'' అన్నాడు రాజు.

''చిత్తం, ప్రభూ!'' అంటూ దొంగ రాజు పాదాలను తాకి కళ్ళకు అద్దుకున్నాడు.

రాజు తలపంకించి చెరసాల నుంచి వెలుపలికి నడిచాడు.

మరునాడు భటులు దొంగను రాజు సమక్షంలో హాజరు పరిచారు.

రాజు ఇవ్వనున్న తీర్పు కోసం సభాస దులు ఆసక్తితో ఎదురుచూడసాగారు.

రాజువాణ్ణి, పరికించి చూస్తూ, ''నగల వ్యాపారి పుణ్యగుప్తుడి ఇంట్లో కన్నం వేశావా?'' అని అడిగాడు.

''వేశాను, ప్రభూ!'' అన్నాడు దొంగ తల వంచుకుని.

''ఇదే మొదటి దొంగతనమా? లేక దొంగతనమే వృత్తిగా బ్రతుకుతున్నావా?'' అని అడిగాడు రాజు.

''దొంగతనం నా వృత్తికాదు ప్రభూ చదువయినవెంటనే, దురదృష్టవశాత్తు చేయని ఒక నేరానికి శిక్షింపబడ్డాను. నా మీద దొంగననే ముద్రపడింది. బతుకు తెరువు కోసం ఎక్కడెక్కడో తిరిగాను. దొంగనని నన్నెవరూ పనిలోకి తీసుకో లేదు.

చివరికి జీవితం మీద విరక్తి పుట్టి చచ్చిపోదామని అడవికి వెళ్ళాను. కాని చావడానికి ధైర్యం చాలక ఆకలితో నకనక లాడుతూ ఒక బావిగట్టున కూర్చున్నాను.

అప్పుడే అటు కేసి వచ్చిన ఒక పుణ్యాత్ముడి నుంచి ఆయన బట్టల మూటతో సహా అన్నం మూటను తెలివిగా కాజేశాను. ఆ మూటలోని అన్నం తిని ఆకలి తీర్చుకున్నాను. దాంతో దొంగతనంతోనే సుఖంగా బతకవచ్చుననే బుద్ధి పుట్టింది. పదిరోజులుగా చిల్లరమల్లర దొంగతనాలు చేస్తూ వచ్చాను. నిన్న వ్యాపారి ఇంటికి కన్నం వేస్తూ భటుల చేతికిపట్టుబడ్డాను,'' అన్నాడు దొంగ కన్నీరుకారుస్తూ.

''నీకు జీవనోపాధి కల్పిస్తే, దొంగతనాలు మానుకుంటావా?'' అని అడిగాడు రాజు సునీలుడు.

''ఈ జన్మలో దొంగతనాల జోలికి పోను, ప్రభూ!'' అన్నాడు దొంగ కన్నీళ్ళు తుడుచుకుంటూ.

''ఈ పదిరోజులుగా దొంగిలించిన సొమ్ములను, వాటి సొంతదారులకు తిప్పి అప్పగించి క్షమాపణ వేడుకో. అంతవరకు భటులు నీ వెంటనే ఉంటారు. ఆ తరవాత నీకు ఏదైనా తగిన జీవనోపాధి ఏర్పాటు చేస్తాను,'' అన్నాడు రాజు. ఆ తీర్పు విని సభికులు హర్షధ్వానాలు చేశారు.

''చిత్తం, ప్రభూ!'' అంటూ దొంగ, భటులవెంట వెలుపలికి నడిచాడు.

రాజు సునీలుడు గురువు వాక్కును స్మరించుకుంటూ తృప్తిగా తలపంకించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రాజు సునీలుడు తప్పు చేసినవాడు శిక్ష అనుభవించక తప్పదు అంటూనే, తన కళ్ళెదుటే జరిగిన తప్పును క్షమించడం విడ్డూరంగా లేదా? తనంత వాణ్ణి ఒక దొంగమోసగించాడన్న విషయం బయట పడితే, తనకు అవమానం తప్పదన్న అనుమానంతోనే రాజు దొంగకు క్షమాభిక్ష పెట్టాడన్న విషయం తేటతెల్లంకదా?



పదిమందిలో అవహేళనకు గురవు తామన్న అనుమానంతో రాజు తననే మోస గించిన దొంగను క్షమించడం న్యాయం, ధర్మం అనిపించుకుంటుందా? ఇందు వల్ల రాజ్యంలో నేరాలు పెరిగే అపాయం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీతల పగిలిపో తుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తప్పు చేసిన వాడు శిక్ష అనుభవించి తీరాలన్నదాంట్లో ఎటువంటి సందేహానికీ తావులేదు. అయితే, శిక్షల ఉద్దేశం దోషిలో పరివర్తన తీసుకురావడం అన్న సత్యం మరిచి పోకూడదు. చెరసాలకు వచ్చిన రాజును గుర్తించగానే దొంగలో పరివర్తన ప్రారంభ మయిందని తెలుస్తూనే ఉన్నది. దొంగ తనం చేసినప్పటికీ వాడు చెప్పినవన్నీ నిజాలేననీ, చేసిన తప్పులకు పశ్చాత్తాపం చెందుతున్నాడనీ రాజు గ్రహించాడు. వాడికి మంచి మార్గం చూపాడు. నేర ప్రవృత్తి ప్రబలడానికి గల మూలకారణా లను అన్వేషించి, వాటిని రూపుమాపడమే సరైన నేరనిరోధక మార్గం అన్న సత్యం గ్రహించి, దానిని ఆచరణలో చూపిన ఆదర్శ పాలకుడు రాజు సునీలుడు. ఇక, రాజు సునీలుడు తాను మోసపోయిన సంగతి బయటపెట్టవద్దని దొంగను కోరినందుకు కారణం-తను పదిమందిలో అవహేళనకూ, అవమానానికీ గురవుతానన్న అనుమానంతో కాదు. పరోపకారం గురించి గురువు చెప్పిన మాటలను తు.చ. తప్ప కుండా తాను పాటించడమే గాక, తన ప్రజలు కూడా పాటించేలా చేయాలన్నది ఆయన ఆశయం. అలాంటప్పుడు రాజం తటివాడు ఉపకారం చేయబోయి మోసా నికి గురయ్యాడన్న విషయం బయట పడితే, సామాన్య ప్రజలలో ఉన్న ఉపకార బుద్ధి సైతం నశించి పోవచ్చు. అలాంటి స్థితి రాకూడదన్న ఉదాత్త ఆశయంతోనే ఆ విషయం బయటపెట్టవద్దని రాజు దొంగను ఆదేశించాడు!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

– (కల్పితం)

[ఆధారం : 'మంజుభారతి' రచన]





# రామాయణం



రాముడు చేసిన అద్భుతమైన యజ్ఞానికి వాల్మీకి తన శిష్యులతో కూడా వచ్చి, ఋషి వాటికలో తన కోసం ప్రత్యేకించిన పర్ణ శాలలో బస చేశాడు. ఆయన కుశలవులతో, ''మీరెవరి బిడ్డలని ఎవరన్నా అడిగితే వాల్మీకి శిష్యులమని చెప్పండి. రాముడు పిలిస్తే ఆయన ఎదుట కూడా రామాయణాన్ని గానం చెయ్యండి'' అన్నాడు. ''అలాగే తాతా'' అని వాళ్ళు పర్ణశాల నుంచి బయలుదేరారు.

వాళ్ళు రాగతాళయుక్తంగా రామాయణ గానం చేస్తున్న సంగతిని విని రాముడు వారిని సదస్సు మధ్యకు పిలిపించి, గానం చెయ్యమన్నాడు.

ఆరోజు కుశలవులు రామాయణం నుంచి మొదటి ఇరవై సర్గలూ పాడారు. రాముడు లక్ష్మణుడితో, ''ఈ కుర్రవాళ్ళకు పద్దెనిమిది వేల సువర్ణాలిప్పించు'' అన్నాడు. కానీ లక్ష్మణుడు వారికి వేరు వేరుగా బంగారం ఇవ్వబోతే వాళ్ళు ''ఈ బంగారం మాకెందుకు? మేము అరణ్యంలో కందమూల ఫలాలు తిని జీవించేవాళ్ళం'' అన్నారు. రాముడు ఆ మాటలు విని ఆశ్చర్యపడి, ''అబ్బాయిలూ, మీరు పాడే ఈ కావ్యం ఎంత ఉంటుంది? దాన్ని ఎవరు రాశారు?'' అని అడిగాడు.

''దీన్ని వాల్మీకి మహాముని రాశారు. ఆయన కూడా ఈ యజ్ఞానికి వచ్చి ఉన్నారు. మీకు వినాలని ఉంటే రోజూ గానం చేస్తాం'' అన్నారు సీత కొడుకులు.

రాముడు సరేనన్నాడు. పిల్లలు రోజూ వచ్చి, అందరి సమక్షంలో కొన్ని సర్గల చొప్పున చాలారోజులపాటు రామాయణాన్ని గానం చేశారు. ఈ గానంతో ఆ పిల్లలు సీత కొడుకు లేనన్నది అందరికీ స్పష్టమయింది.

రాముడు తన దూతలను పిలిచి, ''మీరు

ఉత్తర కాండ-6



వాల్మీకి మహాముని వద్దకు వెళ్ళి, సీత పవిత్రురాలైన పక్షంలో, ఆమె ఇక్కడికి వచ్చి ఆ సంగతి నిరూపించటానికి ఆ మహా ముని అనుమతి కోరుతున్నానని ఆయనతో చెప్పండి'' అని పంపాడు. దూతలు వచ్చి రాముడి కోరికను విన్నవించగానే వాల్మీకి మహాముని ''సీత రాముడి కోరిక ప్రకారం వచ్చి శపథం చేస్తుంది'' అని చెప్పాడు.

దూతలు ఆ మాట చెప్పగానే రాముడు సభికుల ఎదుట సీత తన పవిత్రతను వెల్ల డించుకోబోతోందని ప్రకటించాడు. ఈ మాటకు సంతోషించి, అందరూ రాముణ్ణి అభినందించారు. మర్నాడు తెల్లవారగానే రాముడు యజ్ఞ వాటికకు వెళ్ళి, మహా మునులందరికీ కబురు చేశాడు. రాక్షసు లనూ, వానరులనూ, నానాదేశాల నుంచి వచ్చిన నాలుగు వర్ణాలవారినీ పిలిపించాడు. అందరూ కూర్చుని ఉండగా, వాల్మీకి మహా ముని సీతను వెంటబెట్టుకుని వచ్చాడు. వాల్మీకి వెనక నడిచివచ్చే సీతను చూడగానే అందరికీ గుండెలు నీరయిపోయాయి. వాల్మీకి రాముడితో, రామా, ''ఈ సీత మహా ఇల్లాలు, ధర్మం తప్పనిది. లోకోపవాదు లకు వెరచి ఈమెను నా ఆశ్రమంవద్ద వదలి పెట్టావు. కనుక నీకు ఆమెయందు విశ్వాసం కుదిరేటట్టుగా శపథం చేస్తుంది. ఈ బిడ్డ లిద్దరూ సీత కొడుకులు. నేనెన్నడూ అబద్ధ మాడినవాణ్ణి కాను. వీరు నీ కొడుకులు. నేను అంతులేని తపస్సు చేశాను. సీత నిజంగా చెడ్డదైతే, నా తపస్సు ఫలించక పోవుగాక! లోకోపవాదానికి వెరిచావేగానీ ఆమెలో ఎలాంటి దోషం లేదని నీకూ తెలుసు అన్నాడు.''

రాముడు వాల్మీకికి నమస్కరించి, ''మునీ శ్వరా, మీరన్నది నిజమే. లంకలోనే అగ్ని దేవుడు సీత పవిత్రతతకు సాక్ష్యం పలికాడు. అందుకే నేనీమెను నా వెంట ఇంటికి తెచ్చాను. ఈ మహాసభలో సీత తన నిర్దోషిత్వం రుజువు చేసుకునేటట్టుంటే నేనామెను సంతోషంగా ఏలుకుంటాను'' అన్నాడు.

సీత చేతులు జోడించి, నేల చూస్తూ ''నా మనసులో రాముణ్ణి తప్ప మరెవరినీ స్మరించని పక్షంలో భూదేవి నాకు దారి ఇచ్చు గాక! మనోవాక్కాయాల నేను రాముణ్ణి పూజించే దాన్నయితే భూదేవి నాకు దారి ఇచ్చుగాక! రాముడు తప్ప నాకింకేమీ తెలి యని పక్షంలో భూదేవి నాకు దారి ఇచ్చు గాక!'' అన్నది. సీత అలా అంటుండగానే భూమిలో నుంచి ఒక దివ్య సింహాసనం పైకి వచ్చింది. ఆ సింహాసనం మీద ఉన్న భూదేవి తన రెండు చేతులూ చాచి, సీతను ఎత్తి సింహాసనం మీద కూర్చోబెట్టింది. వెంటనే సింహాసనం పాతాళానికి దిగిపోయింది.

ఇది చూసి అందరూ నిశ్చేష్టితులయి పోయారు. వానరులు ఏడ్చారు. ఎంతసాధ్వి అని మునులు మెచ్చుకున్నారు. రాముడు చేతికర్ర మీద బరువు వేసి తలవంచుకుని చాలాసేపు కన్నీరుగార్చి, ''నేనింత కష్టం ఎన్నడూ అనుభవించలేదు. ఓ భూదేవీ నా సీతను నాకిచ్చెయ్యి లేదా నాకు కూడా దారి ఇయ్యి. ఎవరురా! నా ధనుర్బాణాలు తెండి. ఈ భూమిని బద్దలు చేస్తాను'' అని ఆవేశ పడ్డాడు. అందరూ చేరి అతన్ని ఓదార్చారు.

మర్నాడు మళ్ళీ సభ జరిగినప్పుడు కుశలవులు ఉత్తర రామాయణాన్ని గానం చేశారు. దానితోనే యజ్ఞకాండ ముగిసింది. యజ్ఞానికి వచ్చినవారినందరినీ తగిన విధంగా సత్కరించిన రాముడు అయోధ్యకు తిరిగి వచ్చాడు. అతను వచ్చేటప్పుడు తన కొడుకులను వెంటతెచ్చుకున్నాడు. అతను మరొక స్త్రీని పెళ్ళాడక, బంగారు సీతను పక్కనే ఉంచుకుని అనేక అశ్వమేథ, వాజపేయ యజ్ఞాలు చేశాడు. అతను ధర్మం నిలబెట్టడానికి యత్నిస్తూ, న్యాయంగా పరిపాలన చేసి, ప్రజల ఆదరం పొందాడు. అతని పరిపాలనలో దేశం సుభిక్షంగా ఉన్నది.

కాలక్రమాన కౌసల్యా, సుమిత్రా, కైకేయీ మరణించారు. వారికి రాముడు ఉత్తర క్రియలు చేసి, గొప్పగా దానధర్మాలు చేశాడు. కొంతకాలం గడిచాక రాముడి వద్దకు కైకేయి అన్న అయిన యుధాజిత్తు వద్ద నుంచి గార్గ్యుడు పదివేల గుర్రాల కానుకతో సహా వచ్చి, ''రామా, మీ మామ నీతో ఇలా చెప్ప మన్నాడు. సింధునదికి రెండుపక్కలా గల గంధర్వదేశంలో శైలూషుడి సంతతికి చెందిన గంధర్వులు మూడుకోట్లమంది ఉన్నారు.



వారిని జయించి గంధర్వదేశాన్ని వశపర చుకో. అని యుధాజిత్తు తరపున సందేశం ఇచ్చాడు. ''మంచిది. ఈ కుర్రవాళ్ళు భరతుడి కొడుకులు. తక్షుడూ, పుష్కలుడూ అనే వాళ్ళు. వీళ్ళ వెంట భరతుణ్ణి, సేననూ పంపుతాను. భరతుడు గంధర్వులను జయించి, గంధర్వదేశాన్ని రెండుగా విభజించి, తన ఇద్దరి కొడుకులనూ వాటికి రాజులుగా చేసి తిరిగి వస్తాడు'' అన్నాడు.

భరతుడు పెద్ద సేనను వెంటబెట్టుకుని, కేకయ దేశాన్ని చేరి, యుధాజిత్తును కలుసుకున్నాడు. ఇద్దరూ కలిసి గంధర్వుల మీదికి యుద్ధానికి వెళ్ళారు. యుద్ధంలో గంధర్వులు నశించారు. భరతుడు వారి దేశాన్ని జయించి, తక్షుడికి తక్షశిల నగరాన్నీ, పుష్కలుడికి పుష్కలావతి నగరాన్ని ఏర్పాటుచేసి, ఆ పట్టణాలలో ఐదేళ్ళపాటు ఉండి, అయోధ్యకు తిరిగి వచ్చాడు. ఇక లక్ష్మణుడి కొడుకులైన అంగదుడికీ, చంద్రకేతుడికీ రాజ్యాలు ఏర్పాటు కోసం ఆలో



చించారు. కారుపథమనే దేశాన్ని అంగదుడి కోసమూ, చంద్రకాంతమనే దేశాన్ని చంద్ర కేతుడి కోసమూ ఏర్పాటు చేస్తే బాగుంటుం దని నిర్ణయం జరిగింది. అంగదుడి వెంట లక్ష్మణుడూ, చంద్రకేతుడి వెంట భర తుడూ వెళ్ళి ఆయా దేశాలలో వారికి రాజ్యం ఏర్పాటుచేసి అయోధ్యకు తిరిగి వచ్చారు.

కాలం గడిచింది. ఒకనాడు యముడు మునివేషంలో రాముడి రాజభవనానికి వచ్చి, లక్ష్మణుణ్ణి చూసి, ''లక్ష్మణా, నేను ఒక గొప్ప మహర్షి దూతగా పనిమీద చూడ వచ్చానని రాముడితో చెప్పు'' అన్నాడు. లక్ష్మ ణుడా మాట చెప్పగానే రాముడు మునిని లోపలికి పంపమన్నాడు. యముడు వచ్చి, రాముడిచ్చిన అర్ఘ్యపాద్యాలు స్వీకరించి, ''రామా, మనం ఏకాంతంగా మాట్లాడాలి. మనం మాట్లాడుకునేటప్పుడెవరైనా వచ్చే పక్షంలో నీవు వారికి మరణశిక్ష విధించాలి. అందుకిష్టమయే పక్షంలో నేను వచ్చిన పని చెబుతాను'' అన్నాడు. రాముడు సరేనని, లక్ష్మణుణ్ణి పిలిచి, లక్ష్మణా, ద్వారపాల కుణ్ణి పంపేసి, ''నువే ద్వారం వద్ద ఉండు. మేం మాట్లాడుకుంటుండగా ఎవరు లోప లికి వచ్చినా మరణదండన తప్పదు'' అని చెప్పాడు.

తరువాత యముడు రాముడితో ''రామా, నేను మారువేషం ధరించి వచ్చిన యముణ్ణి, బ్రహ్మ నీతో ఇలా చెప్పమన్నాడు: నీవు రావణ సంహారం కోసం అవతరించిన విష్ణువువు. నీవు భూలోకానికి వచ్చిన పని అయిపో యింది. నీకు ఎప్పుడు తిరిగి రావాలని ఉంటే అప్పుడు తిరిగి రా,'' అన్నాడు. రాముడు నవ్వి ''నీ రాక నాకు చాలా సంతోషం కలి గించింది. నేను కూడా ఎక్కడి నుంచి వచ్చానో అక్కడికి వెళ్ళటానికి సిద్ధంగానే ఉన్నాను'' అన్నాడు. లోపల రాముడు యముడితో ఇలా మాట్లాడే సమయంలో దుర్వాసుడు వచ్చి, ''లక్ష్మణా, ఇప్పుడే నేను రాముణ్ణి చూడాలి'' అన్నాడు.

''స్వామీ మా అన్న మరొక పనిలో నిమ గ్నుడై ఉన్నాడు. కొంచెం ఆగాలి. మీరేంపని మీద వచ్చారో, మీకేం కావాలో చెప్పండి'' అన్నాడు లక్ష్మణుడు. దుర్వాసుడు ఉగ్రుడై వెంటనే ''నన్ను రాముడి దగ్గిరికి తీసుకు పోక పోయావో మీ వంశమంతా నిర్మూలమ య్యేటట్టు శపిస్తాను'' అన్నాడు. తాను ఒక్కడే చచ్చినా నష్టంలేదనీ, సర్వనాశనం కారాదని ఆలోచించి లక్ష్మణుడు లోపలికి వెళ్ళి రాముడిని పిలిచాడు. రాముడు లేచివచ్చి దుర్వాసుడికి నమస్కరించి ''స్వామీ, ఏమి ఆజ్ఞ?'' అని అడిగాడు. ''నాకు వెంటనే భోజనం పెట్టించు'' అన్నాడు దుర్వాసుడు. రాముడాయనకు భోజనం పెట్టించాడు.

దుర్వాసుడు భోజనం చేసి, సంతోషించి వెళ్ళిపోయాడు. రాముడికి తన శపథం జ్ఞాపకం వచ్చి విచారం కలిగింది. లక్ష్మణుడ తన్ని సమీపించి, ''అన్నా, నా కోసం దిగులు పడకు. నన్ను చంపి నీ మాట నిలబెట్టుకో'' అని చెప్పాడు. రాముడు తన మంత్రి పురోహితులను పిలిచి జరిగినదంతా చెప్పి వారి సలహా కోరాడు. ''రామా, లక్ష్మణుణ్ణి విడిచి పెట్టెయ్యి. త్యాగం వధతో సమానం. ధర్మ భంగం కలగరాదు'' అని వశిష్టుడన్నాడు.

లక్ష్మణుడు రాముడికి నమస్కారం చేసి, తన ఇంటికి కూడా పోకుండా, తిన్నగా సరయూ తీరానికి వెళ్ళి, శ్వాస స్తంభింప జేసి, యోగం పట్టాడు. ఇంద్రుడు విమానంలో అదృశ్యంగా దిగివచ్చి లక్ష్మణుణ్ణి శరీరంతో సహా స్వర్గానికి తీసుకుపోయాడు.

తరవాత రాముడు సభచేసి, ''లక్ష్మణుడి లాగే నేను కూడా వెళ్ళిపోతాను. భరతుడికి పట్టాభిషేకం చేసే ఏర్పాట్లు చెయ్యండి'' అన్నాడు. ఆ మాట విని భరతుడికి మతిపోయినట్లయింది. ''నువులేని రాజ్యం నాకెందుకు? కుశలవులకు పట్టం కట్టు. కోసలకు కుశుణ్ణి, ఉత్తర కోసలకు లవుణ్ణీ రాజును చెయ్యి. మనం స్వర్గానికి పోతున్నామని శత్రుఘ్నుడికి కబురు చేద్దాం'' అన్నాడతను. భరతుడు అన్న ప్రకారమే కుశలవుల పట్టాభిషేకం జరిగింది. శత్రుఘ్నుణ్ణి పిలుచుకు రావటానికి మధురాపురానికి దూత వెళ్లాడు. శత్రుఘ్నుడు తన రాజ్యాన్ని కూడా తన కొడుకులైన సుబాహుడూ, శత్రుఘాతీ అనే వాళ్ళకు పంచి అయోధ్యకు తిరిగి వచ్చాడు. రాముడు స్వర్గానికి పోతున్నాడన్న వార్త విని సుగ్రీవ విభీషణులు సపరివారంగా విచ్చేశారు. సుగ్రీవుడు అంగదుడికి పట్టాభిషేకం చేసి మరీ వచ్చాడు.

తరువాత రామ ప్రస్థానం ప్రారంభమయింది. రాముడు సన్నని బట్ట కట్టుకుని, చేత దర్భలు పట్టుకుని, మౌనంగా నడవ సాగాడు. అతనివెంట అంతఃపుర స్త్రీలూ, భరత శత్రుఘ్నులూ, వానరులూ బయలుదేరారు. కొంతదూరం నడిచి రాముడు ఆ నదిలో పాదాలు పెట్టాడు. అతనికి బ్రహ్మ పిలుపు వినబడింది. రాముడికీ, భరత శత్రుఘ్నులకూ వైష్ణవ శరీరాలు వచ్చేశాయి. విష్ణువు బ్రహ్మను చేరాడు. అతనితోబాటు అవతరించిన వారందరూ తమ తమ లోకాలకు తిరిగి చేరుకున్నారు.

— సంపూర్ణం —





# పంచతంత్ర కథలు



దమనకం కరటకానికి పామును చంపిన కాకుల కథ చెప్పి, ''తెలివిని మించిన శక్తి లేదు. బుద్ధి బలం కలిగిన కుందేలు సింహం దురహంకారాన్ని రెచ్చగొట్టి, దానికి చావు తెప్పించింది కాదా?'' అన్నది.

అది ఎలా జరిగింది? అని కరటకం అడిగింది. దమనకం ఈ కథ చెప్పింది:

## నీడ తెచ్చిన చావు

ఒకప్పుడు అరణ్యంలో భాసురకం అనే సింహం, సాటిలేని బలం గలది ఉండేది. అది బలదర్పం కొద్దీ నిత్యమూ అనేక లేళ్ళనూ, కుందేళ్ళనూ, ఇతర మృగాలనూ, అకారణంగా చంపుతూ ఉండేది.

ఒకనాడు అడవిలో ఉండే లేళ్ళూ, మేకలూ, ఎనుములూ, కుందేళ్ళూ, ఇతర మృగాలూ ఏకమై సింహం వద్దకు వెళ్ళి, ''మహారాజా, తాము తమ కంటబడిన ప్రతి ప్రాణిని చంపటం ఇకమీద మానాలి. తమ కడుపు నిండటానికి రోజుకు ఒక జంతువు చాలును. అలాంటప్పుడు ఇన్ని ప్రాణాలు తీయనేల? మాతో ఒక ఒప్పందానికి రండి. ఈరోజు నుంచీ మాలో మేము వంతులు వేసుకుని, ఒక జంతువును తామున్న చోటికే పంపుతాము. తమరు కదిలిరావలసిన పని కూడా ఉండదు. తమరు ఈ ఒప్పందానికి ఒడబడినట్లయితే తమకు కావలసిన ఆహారం శ్రమలేకుండా లభిస్తుంది. రాజు ప్రజల సంపదను ఆవులను పాలు పిండినట్లుగా పిండి, కొంత లేగలకు వదిలి, మంద వృద్ధి అయేటట్టు చూడాలి. అప్పుడే అతను ధర్మపాలన చెయ్యగలడు. ఆవులను పాలు పితకటం మాత్రమే కాదు, వాటికి మేత కూడా వేయాలి. చెట్టుకు ఎరువు వేసి, నీరుపోస్తేగానీ ఫలాలనివ్వదు. ఆఖరుకు అతి చిన్న విత్తు కూడా, సరైన పోషణ జరిగితే మహావృక్షంగా తయారై, ఎంతో లాభం కలిగిస్తుంది. ప్రజలైనా అంతే'' అన్నాయి.

''మీరన్నది నిజం. మీ ఏర్పాటుకు సమ్మతించాను. కానీ ఏ ఒక రోజున అయినా నా వద్దకు మృగం రాకపోయిందో, నేను మీ అందరి ప్రాణాలూ తీస్తాను'' అన్నది సింహం.

మిత్రభేదం – 9



మృగాలు అందుకు సమ్మతించి వెళ్ళి పోయాయి.

ఆ రోజు మొదలు మృగాలన్నీ అరణ్యంలో స్వేచ్ఛగా తిరగనారంభించాయి. అవి వంతులు వేసుకుని, సింహం వద్దకు రోజు కొక జాతి జంతువును మిట్టమధ్యాహ్నం వేళకు పంపుతూ వచ్చాయి.

ఇలా ఉండగా ఒకనాడు కుందేలుకు వంతు వచ్చింది. సింహానికి ఆహారం కావా లంటే కుందేలుకు చాలా విచారం కలి గింది. అది అడుగులో అడుగు వేసుకుని అతి నింపాదిగా నడుస్తూ, ఈ సింహాన్ని చంపెయ్యటానికి ఉపాయం లేదా అని ఆలోచించసాగింది.

సింహం భోజనం చేసే వేళ దాటిపోయింది. కాని కుందేలు ఇంకా ఆలోచిస్తూనే ఉన్నది. అది ఇలా అనుకున్నది. ''ఈ క్రూరసింహాన్ని ఎలాగైనా చంపాలి. తెలివిగల వాడు సాధించ లేనిదీ, దృఢ తీర్మానం గలవాడు జయించ లేనిదీ, మధురవాక్కు గలవాడికి సిద్ధించ నిదీ ఏదీ ఉండదంటారు..'' ఇలా అను కుంటూ అది ఒక బావి వద్దకు వచ్చింది. ఆ బావిలోకి తొంగిచూసే సరికి, దాని అడుగున ఉన్న నీటిలో దాని ప్రతిబింబం కనబడింది. అది ఒక్క క్షణం ఆలోచించి, ''దిక్కుమాలిన సింహాన్ని చంపటానికి అద్భుతమైన ఉపాయం తట్టింది. దానికి వల్లమాలిన రోషం తెప్పించి, ఈ బావిలో పడి చచ్చేటట్టు చేస్తాను'' అనుకున్నది.

ఆ తరువాత చాలా ఆలస్యంగా కుందేలు, సింహం వద్దకు వెళ్ళింది. సకాలంలో తిండి అందక, ఆకలితో అలమటిస్తూ, సింహం అమితమైన కోపంతో ఉన్నది. అది పెద వులు నాక్కుంటూ, ''రేపు జంతువుల నన్నింటినీ చంపేస్తాను'' అనుకుంటున్నది.

ఇంతలో కుందేలు వచ్చి, సింహానికి ఎదురుగా నిలబడింది.

అసలే పిడికెడు జంతువు, అందులోనూ ఆలస్యంగా వచ్చింది. సింహం దాన్ని చూసి కోపోద్రేకంతో, ''ఒక్క పంటికిందికి రావు, ఆలస్యంగా కూడా వస్తావా? ఇప్పుడు నిన్ను చంపి తిని, రేపు మిగిలిన మృగాలన్నింటినీ చంపేస్తాను'' అన్నది.

కుందేలు, సింహం ముందు సాష్టాంగ పడి ''మహారాజా.. నా వల్లగానీ, ఇతర మృగాలవల్లగానీ ఏ దోషమూ లేదు. నేను ఆలస్యంగా రావటానికి మీకు చిన్న భోజనం ఉండటానికి అసలు కారణం చెబుతాను వినండి. ఇవాళ తమకు ఆహారం అయ్యే వంతు మా కుందేళ్ళకు వచ్చింది. ఒక్క కుందేలుతో తమకు కడుపు నిండదని, నాతో కలిపి ఐదు కుందేళ్ళను తమ వద్దకు పంపారు. మేము ఐదుగురమూ తమ వద్దకు వస్తుండగా, నేలలో ఉన్న ఒక గుంటలో

నుంచి ఒకపెద్దసింహం పైకివచ్చి, 'మీరంతా ఎక్కడికి పోతున్నారు? మీకు ఆయువు తీరిపోయింది గనక ఇష్టదేవతా ప్రార్థన చేసుకోండి' అన్నది. 'మేము ఒప్పందం ప్రకారం మధ్యాహ్నానికల్లా భాసురకమనే మహా సింహానికి ఆహారం కావాలి' అని చెప్పాం.

'అర్థంలేని మాట! ఈ అరణ్యం నాది. మీరు ఒప్పందాలు నాతో చేసుకోవాలి, ఎవరో భాసురకమనే దొంగతో కాదు. ఈ భాసురకాన్ని ఇలా పిలుచుకు రండి. ఎవరు ఏమిటో మేము తేల్చుకుంటాం. మాలో ఎవరు గెలిస్తే వాళ్ళే మృగాలన్నింటికీ అధిపతి' అన్నది.

ఆ ప్రకారమే నేను తమ వద్దకు వచ్చి, సంగతి విన్నవించాను. నా ఆలస్యానికి ఇదే కారణం. నేను తిరిగి రాకపోతానేమోనని, ఆ సింహం మిగిలిన కుందేళ్ళను ఉంచేసుకున్నది. అందుకే నేను తమకు అల్పాహారంగా కనిపిస్తున్నాను'' అన్నది.

ఈ మాటలు విని సింహం ''మిత్రుడా, అలా అయితే నాకు ఆ ప్రత్యర్థి సింహాన్ని చూపించు. నాకు జంతువుల మీద వచ్చిన కోపాన్నంతా దానిపై వెళ్ళగక్కి, మనశ్శాంతి పొందుతాను. శత్రువును శీఘ్రంగా నిర్మూలించకపోతే, వాడు బలపడి మననే చంపుతాడు'' అన్నది.

దానికి కుందేలు ''మహారాజా, అతని బలం తెలుసుకోకుండా తమరు అతనితో యుద్ధానికి పోవటం మంచిదికాదు'' అన్నది.

''ఎందుకీ వ్యర్థప్రలాపాలు? నాకు ఆ సింహాన్ని చూపించు. వాణ్ణి చంపేస్తాను'' అన్నది సింహం చిరాకుగా.

కుందేలు సింహాన్ని బావి వద్దకు తీసుకుపోయి, ''ఇదే ఆ సింహం ఉండే కోట'' అన్నది. అది బావిలోకి తొంగిచూసి, ''తమరు వస్తున్నారని తెలిసి ఆ సింహం అప్పుడే బెదిరిపోయినట్లున్నది ఇలా రండి'' అన్నది.

మతిమాలిన సింహం బావిలోకి తొంగి చూసి, తన ప్రతిబింబాన్ని మరొక సింహం అనుకుని, ఆగ్రహావేశంతో గర్జించింది. ఆ గర్జన బావిలో రెట్టింపు ధ్వనితో ప్రతిధ్వనించింది. ఆ సింహం తనను సవాలు చేస్తున్నదనుకుని, బుద్ధిలేని భాసురకం, ఒళ్ళు తెలియని ఆవేశంతో ఆ లోతైన బావిలోకి దూకేసింది.

కుందేలుకు పరమానందమయింది. పాపిష్టి సింహం పీడ వదిలించినందుకు మిగిలిన జంతువులన్నీ కుందేలును మెచ్చుకుని సుఖంగా జీవించాయి.



# నిజమైన వైద్యుడు



భీమేశ్వరుడనే రాజుకు, హఠాత్తుగా ఒక వింత వ్యాధి సోకింది. దాని ఫలితంగా, ఆయన శరీరం నిండా వికృతంగా మచ్చలు ఏర్పడినై. ఆస్థాన వైద్యులు ఎన్నో రకాల చికిత్సలు చేశారు గాని, ఏ మాత్రం ఫలితం కలగలేదు.

రాజధాని నగరంలో ఉంటున్న సీనయ్య అనే వైద్యుడికి, ఈ సంగతి తెలిసింది.

తన అనుభవం మేరకు విచారిస్తే రాజుకు వచ్చిన వ్యాధి చాలా అరుదైనదిగా తెలుస్తోంది. వంశపారంపర్యంగా వైద్య వృత్తి సీనయ్య కుటుంబంలో వస్తున్నది. సీనయ్య తన తండ్రినుంచి అలాంటి వ్యాధికి చికిత్స తెలుసుకున్నాడు.

సీనయ్య అడవి మూలికలతో చికిత్సకు అవసరం అయిన మందులు తయారు చేసి, ఒకనాడు రాజదర్శనానికి వెళ్ళాడు.

ఆస్థాన వైద్యులు అతడిని చాలా ప్రశ్నలడిగి, అతడి చ్చిన జవాబులు విని, అతడు వైద్యశాస్త్రంలో చాలా ప్రావీణ్యం సంపాయించినవాడని గ్రహించారు. రాజు వ్యాధికి నిర్దిష్టమైన చికిత్సా విధానం అతడి వద్ద ఉందనడంలో ఎలాంటి సందేహమూ లేదు.

దానితో వాళ్లకొక భయం పట్టుకుంది. ఒకవేళ సీనయ్య ఇచ్చిన మందు ద్వారా రాజుకు వ్యాధి నయమైతే, తామందరూ ఆయన దృష్టిలో అసమర్థులవుతారు.

దానికితోడు, ఉన్నఫళాన ఆస్థానంలో తమ ఉద్యోగాలకు ఉద్వాసన జరుగుతుంది. రాజ ప్రాపకం లేకపోతే రాజ వైద్యులుకూడా అనామకులుగా ఉండిపోవలసిందే.

ఇలా ఆలోచించి ఆస్థాన వైద్యులు సీనయ్యతో "మేమంతా బాల్యప్రాయంలోనే గురుకులాల్లో చేరి, క్షుణ్ణంగా వైద్య శాస్త్రం అభ్యసించినవాళ్ళం. అలాంటి మా చికిత్సకు లొంగని రాజుగారి వ్యాధి,

వెంటకోట సోమినాయుడు

నీ చికిత్సకు లొంగుతుందనుకోవడం ఒట్టి భ్రమ.

పైగా, నీ మందులు రాజుగారి వ్యాధి కుదుర్చకపోగా, వికటించే ప్రమాదం ఉన్నది. అందుకు మేము బాధ్యులం కావలసివస్తుంది. కనక, రాజదర్శనం అంటూ మరి రాకు,'' అన్నారు చిరాకు పడుతూ.

సీనయ్య చేసేది లేక ఇంటికి తిరిగి వెళ్ళాడు. అయితే, ఆస్థాన వైద్యులు బుద్ధి మార్చుకుంటారేమో అని అతడు నాలుగైదు రోజుల కొకసారి రాజప్రసాదా నికి వెళుతుండేవాడు. వైద్యులు మాత్రం మరింతగా కసిరి అతడిని వెళ్ళగొడుతూం డేవాళ్ళు.

ఇలా ఒకసారి అతడు రాజప్రసాదం నుంచి తిరిగి వస్తూండగా, ఒక ధర్మసత్రం అరుగు మీద కూర్చుని వున్న రోగి అతడి దృష్టిని ఆకర్షించాడు. ఆ రోగి శరీరం నిండా వికృతంగా మచ్చలున్నవి. అది రాజును పీడిస్తున్న వ్యాధిలాంటిదే.

సీనయ్య ఆ రోగికి చికిత్స ప్రారంభించి, నెల తిరక్కుండానే అతడిని సంపూర్ణా రోగ్యవంతుడిని చేశాడు.

రాజు ఒకనాటి సాయంకాలం ఇద్దరు అంగరక్షకులు వెంటరాగా ఉద్యానానికి పోతూ, సత్రం అరుగు దిగి తనకు నమస్క రించిన పాత రోగిని చూసి ఒక్కసారిగా ఆశ్చర్యపోయాడు. తన అంగరక్షకులతో మాట్లాడుతూ, ''శరీరమంతా మచ్చలతో, ఇతడు అరుగుమీద ముడుచుకుని పడు



కుని వుండటం లోగడ చాలాసార్లు చూశాను. ఇంతలో ఇతడెలా ఆరోగ్యవంతు డయ్యాడు! నిజం ఏమిటో ఇప్పుడే ఇక్కడే తేలాలి. పోయి అతడిని పిలుచుకుండి,'' అన్నాడు.

అంగరక్షకులు పోయి అతడిని రాజు దగ్గరకు తీసుకువచ్చారు. రాజు అడిగిన మీదట సీనయ్యను గురించిన వివరాలన్నీ చెప్పాడు.

రాజు ఆ రాత్రి మారువేషంతో సీన య్యను చూడబోయాడు. తనను పట్టి పీడిస్తున్న వ్యాధి గురించి సీనయ్యకు చెప్పాడు.

సీనయ్య ఆయనను పరీక్షించి చికిత్స ప్రారంభించాడు. ఇరవై రోజుల్లోనే రాజు ఆరోగ్యవంతుడయ్యాడు.

ఆయన సీనయ్యకు కృతజ్ఞత చెప్పు కుని, బయలుదేరబోతుండగా, సీనయ్య ఆయనతో, ''ఈ వ్యాధి చాలా అరుదైనది.

దురదృష్టం కొదీ లక్షమందిలో, ఏ ఇద్దరు, ముగ్గురో దీనివాత బడతారు. అలాంటి వాళ్ళకు కూడా నేను చికిత్స చేసి, సంపూర్ణ ఆరోగ్యవంతుల్ని చేశాను. కాని, ఈ దేశపు మహారాజుకు చికిత్స చేసే మార్గం కనబడటం లేదు,'' అన్నాడు.

''అదెంతపని! వెళ్ళి, రాజదర్శనం చేసుకుని, ఆయనకు వచ్చినపని చెప్పు,'' అన్నాడు.

అప్పుడు సీనయ్య, ఆస్థాన వైద్యులు తనకు రాజదర్శనం కాకుండా ఎలా అడ్డు పడుతున్నదీ చెప్పాడు. దానితో రాజుకు ఆస్థానవైద్యుల కపటబుద్ధి తెలిసిపోయింది.

ఆస్థాన వైద్యులకు తన ఆరోగ్యం కన్న తమ పదవులు ముఖ్యమన్నమాట! వాళ్లు కుదర్చలేని వ్యాధి సీనయ్య కుదిర్చితే, అప్పుడు అతడు తనకు ప్రధాన వైద్యుడవుతాడు. ఇది సహించలేకే వాళ్ళు సీనయ్యకు అడ్డు తగిలారు.

రాజు, వెనుకా ముందూ చూడకుండా సీనయ్యకు ఆస్థాన ప్రధాన వైద్యుడి పదవి ఇవ్వాలని నిర్ణయించుకుని, ''అతడితో, సీనయ్యా నేను మారువేషంలో నీ దగ్గర చికిత్స చేయించుకుంటున్న ఈ దేశపు రాజును,'' అంటూ మారువేషం తీసివేసి తన్నుతాను పరిచయం చేసుకున్నాడు. నిజ వేషంలో రాజును చూడగానే ఆశ్చర్య పోయిన సీనయ్య ప్రణామం చేశాడు.

'రేపు ఉదయం రాజోద్యోగులు నిన్ను సకల లాంఛనాలతో రాజప్రసాదానికి తీసుకువస్తారు.

అప్పుడు నిన్ను ఘనంగా సన్మానించడమే గాక, ఆస్థానంలో ప్రధాన వైద్యుడి పదవి ఇస్తాను.

ఆ తర్వాత నువ్వు, నగరంలో మారు



మూల ఈ పాతకాలపు భవంతిలో నివసిస్తూ అగచాట్లు పడవలసిన అవసరం ఉండదు,'' అన్నాడు.

సీనయ్య, రాజుకు నమస్కరించి, ''మహారాజా, తమరు ఇస్తానన్న ఆ పదవి తిరస్కరిస్తున్నందుకు క్షమించండి. నాకు, ఈ పాత కాలపు భవంతిలో వుండటంలోనే తృప్తీ, సుఖం ఉన్నది,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యపోతూ, ''ఇదేమిటీ నేనిచ్చే పదవీ, సంపదలూ – ఏవీ నీకు తృప్తి, సుఖం కలిగించలేవా?'' అని అడిగాడు.

''అవును, మహారాజా! ఒకసారి నేను తమ ఆస్థానంలో కుదురుకున్నాక, తమకూ, రాజకుటుంబీకులకూ తప్ప, ఇతరులెవరికీ వైద్యం చేసే అవకాశం వుండదు. రోగగ్రస్తులైన పేద, సామాన్య ప్రజల మాటేమిటి? పదవీ, ధనవ్యామోహాలకు దాసుడనై, నా వైద్యవిద్యను కొద్ది మందికోసం పరిమితం చెయ్యలేను.'' అన్నాడు సీనయ్య.

సుఖాల కన్నా పేదల బాగోగులకు ప్రాధాన్యత ఇస్తున్న సీనయ్య మాటల్లో రాజుకు ఎంతో సత్యం కనబడింది. ఆయన కాసేపు ఆలోచించి వూరుకుని, ''సీనయ్యా, నువ్వు నిజమైన వైద్యుడివి! నా రాజ్య పౌరుడివైనందుకు ఎంతో గర్వపడుతున్నాను.

నీ కోరిక ప్రకారం నువ్వు మరింతగా సామాన్య ప్రజలకు వైద్య సహాయం చేసేందుకు వీలు కలిగించదలిచాను. ప్రతి నెలా కోశాగారం నుంచి ఇంతమొత్తం అంటూ, నీకు డబ్బు పంపుతాను. దానితో నువ్వు, అవసరం అనుకున్న చోట ధర్మవైద్యశాలలు నిర్మించి, రోగులకు సాయపడు, ఇది నీకు ఇష్టమేనా?'' అని అడిగాడు.

''మహారాజా, ఇంతకన్న నా జీవితానికి కావలిసినదేమీ లేదు. ఎంత బలంగా కోరిక ఉన్నా, నాకు స్వయంగా ధర్మవైద్యశాలలు నిర్మించే ఆర్థికస్థోమత లేదు. అడక్కుండానే వరమందిస్తున్న మీ సహాయానికి చాలా కృతజ్ఞుడిని'' అన్నాడు సీనయ్య రాజుకు నమస్కరిస్తూ.

రాజు సంతోషంగా తన ప్రాసాదానికి తిరిగి వెళ్లాడు.





# పోయిన ఉంగరం



ఒక శబరరాజు దగ్గిర ఇల్లుడూ, పులిదొరా అనే ఇద్దరు కొలువు చేసేవాళ్ళు. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులు. ఇద్దరూ నమ్మకమైన వాళ్ళే. కాని రాజుకు ఇల్లుడంటే అభిమానమూ, పులిదొర అంటే ద్వేషమూ ఉండేది.

ఒకరోజు రాజు ఆ ఇద్దరినీ పిలిచి, ''మీ రిద్దరూ సెలవు తీసుకుని ఇళ్ళకు పొండి. మూడు రోజుల అవతల సంబరం జరుగుతుంది. దానికి రండి. ఇవిగో మీ బహుమానాలు,'' అంటూ పులిదొరకు పెద్ద కందదుంపా, ఇల్లుడికి చిన్న రాయీ ఇచ్చాడు. తనకు రాజు పనికిమాలిన రాయి ఇచ్చాడని ఇల్లుడికి లోపల కాస్త గునుపుగా ఉండి, ''ఈ వెధవ రాయిని పనికట్టుకుని ఇంటికి మోసుకుపోవటం కూడా దేనికి, ఇక్కడే ఏ పొదలోనో పారేస్తాను,'' అన్నాడు.

''వద్దు, వద్దు. ఈ కందదుంపను మొయ్యలేక చస్తున్నాను. మనం వస్తువులు మార్చుకుందాం,'' అన్నాడు పులిదొర. ఇద్దరూ తమ తమ బహుమానాలు మార్చుకుని తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఇల్లుడు తన భార్య చేత కంద వండించుకు తిన్నాడు.

పులిదొరకు రాయి మాట ఆ రాత్రి దాకా జ్ఞాపకం రాలేదు. అతను ఇంటి బయట వెన్నెలలో కూర్చుని, ఆ రాయి తీసి పరీక్షిస్తూ ఉండగా, దాని పగులులో ఏదో తళుక్కున మెరిసింది. అతను ఆ రాతిని పగలగొట్టేసరికి దానిలోపల నేర్పుగా దాచి ఉన్న బంగారు నగలు బయటపడ్డాయి.

రాజు పక్షపాతబుద్ధి పులిదొరకు అర్థమయింది. ఆ నగలు ఇల్లుడి కోసం ఉద్దేశించినవి. అయినా వాటిని తానే ఉంచుకోవటానికి పులిదొర నిశ్చయించాడు. బహుమతులు మార్చుకోవటం జరిగింది గద. మూడు రోజుల అనంతరం రాజుగారి ఇంటి వద్ద సంబరమూ, విందూ

25 ఏళ్ళనాటి చందమామ కథ



జరిగాయి. ఎంతోమంది వచ్చారు. భోజనాలు చేసే సావిడిపాక కిటకిటలాడిపోయింది. రాజు అందరినీ పలకరిస్తూ, పులిదొర ధరించిన ఆభరణాలు చూసి, ''ఇవి నీకు ఎక్కడివి?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

తాము బహుమానాలు మార్చుకున్న సంగతి ఇల్లుడూ, పులిదొరా రాజుకు తెలిపారు. రాయి విలువ తెలియక దాన్ని పులిదొరకు ఇచ్చినందుకు ఇల్లుడు రాజుకు క్షమాపణ కూడా చెప్పుకున్నాడు.

రాజు ఇల్లుణ్ణి క్షమించాడు. కాని పులిదొరను హతమార్చటానికి నిశ్చయించాడు. పులిదొర రాజుతో, ''ఈ నగలు నేను ఉంచుకున్నందుకు ఏలినవారు క్షమించాలి. తమరిచ్చిన బహుమానాలను మేము న్యాయంగా మార్చుకున్నాం. కందగడ్డను ఇల్లుడూ, భార్యా భోంచేశారు,'' అన్నాడు.

''నిన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తున్నాను. అందుకు నిదర్శనంగా నీకు నా ఉంగరం బహుమానంగా ఇస్తున్నాను. దీన్ని పోగొట్టుకున్నావంటే మటుకు నీకు మరణశిక్ష విధిస్తాను. గుర్తుంచుకో!'' అన్నాడు రాజు, పులిదొరకు తన వేలిఉంగరం ఇస్తూ.

రాజు తన మీద పగపట్టినట్టు పులిదొర గ్రహించి, ఆ ఉంగరాన్ని ప్రాణప్రదంగా కాపాడాలనుకున్నాడు. అతని గుడిసెలో ఉంగరాన్ని దాచే చోటే లేదు. ఆ రాత్రి తన భార్యా, కొడుకూ నిద్రపోయేటప్పుడు అతను తన ఇంటి మట్టిగోడలో రంధ్రం తొలిచి, అందులో ఉంగరాన్ని పెట్టి, తడి మట్టితో రంధ్రాన్ని కప్పి, గుర్తు తెలియరాకుండ ఆ మట్టిని గోడతో సమంగా చదునుచేసేశాడు.

రెండు రోజులు గడవనిచ్చి రాజు పులిదొర భార్యను పిలిపించి, ''నీ మొగుడు ఉంగరం ఎక్కడ దాచాడో కనుక్కుని తీసుకొచ్చి నా కియ్యి. నీకు బోలెడంత బంగారం ఇస్తాను. ఈ మాట తొందరపడి నీ మొగుడితో అనకు; బంగారం చూసినప్పుడు అతను ఆశ్చర్యపోతాడు,'' అన్నాడు.

రాజు తన భర్త ప్రాణం తీయదలచి ఉంగరం అడిగాడని పులిదొర భార్య ఎరగదు. ఆమె ఉంగరం కోసం ఇల్లంతా గాలించింది. ఉంగరం కనిపించలేదు.

ఆ సాయంకాలం ఆమె, తన భర్త ఇంటికి రాగానే, ''నీ దగ్గిర ఏదో ఉంగరం ఉండెనే, అది ఏమయింది?'' అని అడిగింది.

ఉంగరం తన భార్య కళ్ళ పడనే పడిందనుకుని పులిదొర, ''గోడలో దాచాలే,'' అన్నాడు.

మర్నాడు భర్త బయటికి వెళ్ళిన సమయంలో పులిదొర భార్య గోడలన్నీ శ్రద్ధగా పరిశీలించింది; అనుమానంగా ఉన్న చోటనల్లా గోడలో గీరింది. చిట్టచివరకు ఆమెకు ఉంగరం దొరకనే దొరికింది. ఆమె చప్పున ఆ రంధ్రాన్ని మట్టితో పూడ్చి, ఉంగరం తీసుకుని రాజుగారి ఇంటికి పరిగెత్తింది.

రాజు ఉంగరం తీసుకుని, ఆమెకు సంచీలో బంగారం ఇచ్చాడు. ఆమె పరమానందంతో ఇంటికి తిరిగి వచ్చి, ఆ సంచీని ఇంటి వెనక పూడ్చిపెట్టింది.

వారం పూర్తి అయిన రోజున పులిదొర దగ్గిరికి రాజుగారి మనిషి వచ్చి, ''ఉంగరం తీసుకుని రాజుగారు రమ్మంటున్నారు,'' అని చెప్పాడు.

పులిదొర తాను ఉంగరం దాచిన చోట వెతికి, ఉంగరం పోయినట్టు తెలుసుకుని, ''నా ఆయువు మూడింది!'' అనుకున్నాడు. అతను తన భార్యను పిలిచి, ''ఉంగరం చూశావా?'' అని అడిగాడు. నిజం చెబితే భర్త కొడతాడని గ్రహించి ఆమె ఉంగరం చూడలేదన్నది.

పులిదొర కాళ్ళీడ్చుకుంటూ రాజు దగ్గరకు వెళ్ళి, ఉంగరం చూపలేనన్నాడు.

''అయితే నీకు మరణదండన తప్పదు,'' అన్నాడు రాజు.

''శిక్షరేపటిదాకా వాయిదా వెయ్యండి. ఈ లోపల నా వ్యవహారాలు చక్కబెట్టుకుంటాను,'' అన్నాడు పులిదొర.

''సరే, రేపు ఉదయం కసాయిలను నీ ఇంటికి పంపుతాను,'' అన్నాడు రాజు.

పులిదొర కాళ్ళీడ్చుకుంటూ తన ఇంటికి బయలుదేరాడు. కాని మధ్య దారిలో అతనికి ఒక వాగు ఒడ్డున కాస్సేపు కూర్చోవాలనిపించింది. ''రేపు ఎలాగూ చస్తున్నాను గనక, ఇవాళ ఒక్క సుఖమైనా అనుభవిస్తాను. వాగులో పెద్ద చేపను పట్టి,



నాకు కావలిసినట్టు భార్య చేత వండిం చుకు తింటాను,'' అనుకుని పులిదొర బొడ్డులో నుంచి చేపలు పట్టే గాలం పైకి తీసి, నీటిలో వేశాడు.

కొంతసేపటికి చేప పడింది. పైకి తీసి చూస్తే అది ఒక పెద్ద తెల్ల చేప. పులిదొర దాన్ని తీసుకుని ఇంటికి వెళ్ళేసరికి, ఇంటి వద్ద అతని భార్య లేదు. ఆమె వచ్చే లోపుగా తానే చేపను శుభ్రం చేతామను కుని అతను దాన్ని కత్తితో కోసి, ఆనం దంతో, ''ఉంగరం! రాజుగారి ఉంగరం!'' అని కేకపెట్టాడు.

అతను అప్పటికప్పుడే రాజుగారి ఇంటికి పరుగుతీస్తూ, దారిలో కనిపించిన ప్రతి మిత్రుడితోనూ, ''నా ఆయువు మూడిందే అనుకున్నాను, కాని బతికి పోయాను!'' అని గట్టిగా అరిచి చెప్పాడు. అతడి మిత్రులూ, పరిచయస్థులూ విషయం పూర్తిగా విని సంతోషించి అతడి వెన్నంటి నడిచారు. అతను రాజుగారి ఇంటికి చేరేసరికి అతని వెంట ఒక పెద్ద మూక తయారయింది.

''బయట ఏమిటా కోలాహలం?'' అని రాజు తన నౌకర్లను అడిగాడు. అంతలోనే పులిదొర తన మిత్రులతో సహా లోపలికి వచ్చి, రాజుతో, ''ఇదుగో మీ ఉంగరం. నా మరణదండనను మీరు రద్దుచెయ్యవచ్చు,'' అన్నాడు.

రాజు మరణదండనను రద్దు చెయ్యక తప్పలేదు. అదీగాక, తన చేతికి తిరిగి వచ్చిన ఉంగరం మళ్ళీ పులిదొర వద్దకు ఎలా వెళ్ళిందో, ఏ మాయశక్తులు పులి దొరకు సహాయపడుతున్నాయో రాజు ఊహించలేకపోయాడు. ఆయన తిరిగి పులిదొరకు అపకారం చేసే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు.

నిజానికి జరిగినదేమంటే, పులిదొర భార్య తనకు ఉంగరం తెచ్చి ఇయ్యగానే రాజు దాన్ని తన తల దగ్గిర ఉండే పీట మీద ఉంచాడు. ఆ రాత్రి ఒక ఎలుక పీట మీదుగా పరిగెట్టుతూ, ఉంగరాన్ని నీళ్ళ కుండలోకి తోసింది.

మర్నాడు రాజుగారి నౌకరు అల వాటుగా ఆ కుండలోని నీళ్ళు వాగులో పారబోసి కొత్త నీరు పట్టుకుపోయాడు. రాజుకు ఈ ఘటనలు ఏవీ తెలియనం దున, తన ఉంగరం తిరిగి పులిదొరకు ఎలా దొరికినదీ ఊహించలేక పోయాడు.



# శిథిలాలయం - 5




(పూజారి అనుచరులు పెట్టిన మాటులో నుంచి బయటపడిన శిఖముఖి దగ్గరకు విక్రమ కేసరి వచ్చాడు. అప్పుడు ఆ ఇద్దరూ కలిసి దొంగలను వెతుకుతూ కొండ ప్రాంతాలకు వెళ్ళారు. అక్కడ త్రిశూలం పట్టుకుని ఉన్న ఒకపెద్ద కొయ్యబొమ్మ కనిపించింది. దాని కిందుగా ఎర్రగండు పరిగెత్తేంతలో త్రిశూలం వేగంగా కిందికి దిగసాగింది. తరువాత...)

కొయ్యబొమ్మ చేతులు కదిలినప్పుడు కలిగిన అతి స్వల్పమైన ధ్వనిని ఎర్రగండు వినగలిగింది. వెంటనే అది ఒక్క దూకున బాణంలా ముందుకు దూసుకు పోయింది. మరుక్షణం బొమ్మ చేతిలోని త్రిశూలం బలంగా నేలను తాకింది. శిఖముఖీ, విక్రమ కేసరీ నివ్వెరపోయారు.

''ఇది కొయ్యబొమ్మకాదు, రాక్షసి బొమ్మ. ఎర్రగండు ప్రాణాలు దక్కించుకున్నది. అదృష్టంకొద్దీ మనం కూడా చావు తప్పించు కున్నాం'' అన్నాడు విక్రమకేసరి.

శిఖముఖి కొయ్యబొమ్మను సమీపించి, దాన్ని జాగ్రత్తగా పరీక్షించి చూస్తూ, ''ఇది శిథిలాలయ పూజారి మన కోసం పెట్టిన మాటు. కాని, మనకంటే ముందుగా ఎవడో నిర్భాగ్యుడు ఈ దారి వెంట ముందుకు పోయి, దీని చేతిలోని త్రిశూలంవల్ల గాయ పడటమో, మరణించటమో జరిగింది. త్రిశూలాన్ని అంటి ఉన్న నెత్తురు సూర్య కాంతిలో ఎలా మెరుస్తున్నదో చూశావా?'' అన్నాడు.

విక్రమకేసరి ఆ రాక్షసిబొమ్మ కాళ్ళలో ఒకదాన్ని ఈటెతో పొడిచి చూశాడు. బొమ్మ కొంచెంగా కదుల్లాడింది. అతడు శిఖముఖి కేసి తిరిగి, ''శిఖీ, మనం దీన్ని తేలిగ్గా పడగొట్టగలం అని నాకు తోస్తున్నది. దీన్ని ఇలాగే ఉండనివ్వటం ప్రమాదకరం. మనవాళ్ళు అజాగ్రత్తగా దీని కిందుగా

దాసరి సుబ్రహ్మణ్యం

నడవటం జరిగితే చావు తప్పదు'' అన్నాడు.

శిఖముఖి ఆ మాటలకు అవునన్నట్టు తలూపి, అక్కడికి సమీపంగా ఉన్న ఒక పెద్ద రాతిని విక్రమ కేసరికి చూపుతూ, ''మనం ఇద్దరం దాన్ని కదిలించగలం అనుకుంటాను. పట్టుపట్టి ఆ రాయిని కొయ్యబొమ్మ కాళ్ళమీదికి నెట్టగలిగామంటే, అది కుప్ప కూలటం ఖాయం'' అన్నాడు.

ఆ వెంటనే శిఖముఖీ, విక్రమకేసరీ బండరాయిని బలంగా పట్టుకుని ఉన్న చోటు నుంచీ కదిలించి, విసురుగా దాన్ని కొయ్యబొమ్మ కాళ్ళకేసి నెట్టారు. రాయి దొల్లుకుంటూ పోయి బొమ్మకాళ్ళల్లో ఒక దాన్ని ఢీకొట్టింది.

మరుక్షణం కొయ్యబొమ్మ కిర్రుమంటూ కదిలి దభీమంటూ కింద పడిపోయింది. దాని చేతిలో ఉన్న త్రిశూలం ఎగిరి అంత దూరాన పడింది.

''ఆహా, మనం మహా ఘనకార్యం చేశాం. కానీ, ఈ రాక్షసి బొమ్మ కుప్పకూలుతూ చేసిన ధ్వని పూజారికీ, వాడి అనుచరులకూ వినబడే ఉంటుంది'' అన్నాడు శిఖముఖి.

''అందుకు సందేహం లేదు. నన్నడిగితే ఆ దుర్మార్గులు మనం ఈ బొమ్మను సమీపిస్తూండటం ఏ రాళ్ళ చాటు నుంచో ముందే చూసి ఉంటారంటాను. దాని చేతిలోని త్రిశూలం మన గుండెల్లో ఎప్పుడు గుచ్చుకుంటుందా అని వాళ్ళు ఉవ్విళ్ళూరి ఉంటారు కూడా. కాని వాళ్ళ ఎత్తు పారలేదు'' అన్నాడు విక్రమకేసరి.

''నిజమే. ఇప్పుడు నాకో అనుమానం కలుగుతున్నది. మనం అమాయకంగా ఆ దుష్టులు పెట్టిన బోనులోకి నడపటం లేదు కదా! ఇంతకుముందు మనం పల్లెవాసుల్ని



గూడేనికి తిరిగి పొమ్మని చెప్పటంలో పెద్ద పొరపాటు చేశాం. అంత పెద్ద శత్రుమూకను మన ఇద్దరం ఎదిరించి ఎలా నిలవగలం? వాళ్ళు ఈ దాపుల నున్న ఏ కొండ గుహలోనో ఉంటారు. సందేహం లేదు'' అన్నాడు శిఖముఖి.

వాళ్ళిద్దరూ అలా మాట్లాడుతున్నంతలో కొండ గుహల కేసి పోయిన ఎర్రగండు మొరుగుతూ వాళ్ళ దగ్గిరకు పరిగెత్తు కొచ్చింది.

కుక్కను చూస్తూనే శిఖముఖికి పూజారి ముఠా ఆ దాపులనే ఎక్కడో దాగి ఉన్నారన్న అనుమానం కలిగింది. బహుశా వాళ్ళు తమ మీదికి దాడికి రాబోతున్నారేమో! శిఖముఖి, ఎర్రగండు తల నిమురుతూ, ''కేసరీ! మనం ఇలా నిలబడి ముందుకు పోవటం ప్రమాదం. పూజారి అనుచరులు ఒక్క బాణం దెబ్బతో మనిద్దర్నీ హతమార్చగలరు. రాళ్ళచాటుగా పాకుతూ ముందుకు పోదాం. ఎర్రగండు మనకు దారి చూపగలడు'' అన్నాడు.




ఎర్రగండు పసిగట్టి ముందుకు పోవటానికి మారుగా, వెనక కాళ్ళమీద లేచి నిలబడి పెద్దగా మొరగసాగింది. దాని ప్రవర్తన బాగా తెలిసిన శిఖముఖి రాళ్ళ చాటున పాకుతూ పోతున్నవాడల్లా లేచి నిలబడ్డాడు. అతడి దృష్టి తమకేసి పరిగెత్తుకొస్తున్న ఒక శబరుడి పైన బడింది. అతడు విల్లంబులు ధరించి ఉన్నాడు. దూరాన్నుంచి పరిగెత్తుకొస్తున్నవాడిలా కనబడ్డాడు.

శబరుడు తనను సమీపించగానే శిఖముఖి, ''అలా పరిగెత్తుకొస్తున్నావేం? ఏం జరిగింది? నువ్వే గూడెంవాడివి?'' అని ప్రశ్నించాడు.

శబరుడు రొప్పుతూ, మాది తిమ్మగూడెం. ''మా గూడెంలో ఉన్న ధాన్యమంతా ఎక్కడి నుంచో వచ్చిన సవరజాతి ముఠావాళ్ళు దోచుకుంటున్నారు. సాయం కోసం మీ పల్లెకు వస్తున్నాను. పల్లె పెద్ద శివాలుడి కొడుకు శిఖముఖివి కాదా నువ్వు? నీ కుక్కను చూసి, ఈ ప్రాంతాల మీ వాళ్ళుంటారని, కుక్క వెనగ్గా పరిగెత్తుకుంటూ వచ్చాను'' అన్నాడు. శబరుడు దోపిడీదొంగలని చెప్పే సవరజాతివాళ్ళు శిథిలాలయ పూజారి అనుచరులై ఉంటారని శిఖముఖీ, విక్రమకేసరి కూడా భావించారు.

శిఖముఖి కొండపాదంలో ఉన్న తిమ్మగూడెం దిక్కుకేసి చూస్తూ, ఆ గూడెంవాణ్ణి, ''ఆ ధాన్యం దోపిడీగాళ్ళ వెంట అంత పొడుగ్గా శవాకారంలో ఉన్న వాడెవడైనా ఉన్నాడా?'' అని అడిగాడు.

''అలాంటి వాడెవడూ లేడు. సవరల నాయకుడి పేరు గండుపోతు. ఇంత మీసాలూ వాడూ అడవి దున్నలా ఉన్నాడు'' అని చెప్పాడు తిమ్మగూడెంవాడు.

''సరే, నువ్వు మా పల్లెకుపోయి సంగతి చెప్పి మనుషుల్ని సహాయం తీసుకురా. మేం ఇద్దరం ముందుగా మీ గూడేనికి పోయి ఆ గండుపోతు దోచుకున్న ధాన్యంతో పారిపోకుండా చూస్తాం. మీ గూడేనికి దారి నే నెరుగుదును'' అన్నాడు శిఖముఖి.

తిమ్మగూడెంవాడు, కుంభారమిట్ట పల్లె కేసి పరిగెత్తాడు. శిఖముఖి, విక్రమకేసరి కొండదారుల వెంట తిమ్మగూడెం కేసి బయలుదేరారు.

పావుగంట తరువాత వాళ్ళు ఆ గూడేన్ని చేరేసరికి, గూడానికి ఓ పక్కగా ఉన్న చెట్ల కింద చాలామంది శబరులు మందగా నిలబడి ఉన్నారు. వాళ్ళను అదిలిస్తూ పదీ పన్నెండుమంది సవర జాతివాళ్ళు కాపలా కాస్తున్నారు. ఆ కాపలా వాళ్ళను చూస్తూనే.. శిఖముఖీ, విక్రమకేసరీ ఆ దొంగలు శిథిలాలయ పూజారి అనుచరులని గ్రహించారు.

శిఖముఖికి ఆ క్షణంలో ఓ ఉపాయం తోచి, ఆ కాపలా వాళ్ళను సమీపించి, ''మీ యజమాని ఆ శిథిలాలయ పూజారి ఎక్క



మాకు విరోధం లేదు. మీది మీదికి వచ్చారో మీకు చావు తప్పదు.

ఈలోపల మీరు మందవేసి కాపలా కాసే శబరులంతా పారిపోతారు. ఆ సంగతి తెలిసిందంటే పూజారి మిమ్మల్ని నిలువునా భస్మం చేసేస్తాడు'' అన్నాడు శిఖముఖి.

శిఖముఖి ఇలా అనేసరికి, అతడి మీదికి రాబోయిన సవరుడు ఈటె దించి, తిరిగి తన అనుచరుల దగ్గరకు పోయి, ''మనకు కులపెద్ద గండుపోతు చెప్పిన పని ఉండనే ఉన్నది. ఈ కుర్రవెధవల్తో ఏంపని'' అని చెప్పి, శిఖముఖికేసి తిరిగి ''పూజారి దొర ఎక్కడున్నాడో మాకు తెలీదు. ఆ దొరకు కుడిభుజం లాంటి సవరగండుపోతు గ్రామంలో ధాన్యం మూటలు కట్టిస్తున్నాడు. చావదలచుకుంటే అక్కడికిపోయి పూజారి దొర సంగతి అతణ్ణడగండి'' అన్నాడు.

శిఖముఖీ, విక్రమకేసరీ అక్కణ్ణించి కదిలి గ్రామంలోకి కొంతదూరం నడిచి, ఇప్పుడేం చేయటమా అని ఆలోచించారు. కనీసం ఓ అరగంట కాలంలో తమ పల్లె నుంచి సహాయం తప్పకవస్తుందని వాళ్ళకు నమ్మకం కలిగింది.

''ఆ గండుపోతుతో మాటలు పెంచి, వాడు ధాన్యం ఎత్తుకు పారిపోకుండా కొంత సేపు ఆపగలిగామంటే, మా అయ్యతో వచ్చే మన పల్లెవాళ్ళు, ఈ సవర బందిపోట్లందరినీ పట్టేస్తారు. ఆ తరువాత ఒంటరిగాడై పోయిన పూజారిగాణ్ణి దొరకపుచ్చుకోవటం ఏమంత కష్టకార్యం కాదు. ఏమంటావ్ కేసరీ?'' అని ప్రశ్నించాడు శిఖముఖీ.

''భలే, ఆలోచన. ఊ పద'' అన్నాడు విక్రమకేసరి. ఆ ఇద్దరూ గ్రామం మధ్యకు వెళ్ళేసరికి, అక్కడ ఒక పెద్ద పాతరనుంచి

డున్నాడు? చాలా అవసరం అయిన పనుంది'' అన్నాడు.

ఆ ప్రశ్నకు కాపలా వాళ్ళల్లో ఒకడు పొట్ట రెండు చేతులతో పట్టుకుని పెద్దగా నవ్వి, ''పూజారి దొరను చూసేంత ఘనుడివా నువ్వు, శబరకుంకా! ఆ దొర కావాలనుకుంటే ప్రత్యక్షమవుతాడు, వద్దనుకుంటే మాయమైపోతాడు'' అన్నాడు.

ఇంతలో కాపలావాళ్ళల్లో మరొకడు ఎర్రగండుకేసి, శిఖముఖికేసీ గుచ్చిగుచ్చి చూసి, ''అరే! వీడు రాత్రి మనం పెట్టిన మాటునుంచి తప్పించుకుపోయిన శబర పిశాచంగాడు. మనవాళ్ళనిద్దర్ని గాయపరిచాడు.

ఆ కుక్కను పట్టుకోబోయి మనలో నలుగురం కాట్లు తిన్నాం. ఆ పక్కన ఉన్నవాడి ముఖం ఎక్కడో చూసినట్టుందే'' అంటూ ఈటె ఎత్తి శిఖముఖి వాళ్ళను సమీపించబోయాడు.

శిఖముఖీ, విక్రమకేసరీ వాడి మీదికి ఈటె గురిచేశారు: ''మీ కాపలావాళ్ళతో

ధాన్యం బయటికి తీసి, కొందరు సవరలు మూటలు కడుతుండటం వాళ్ళ కంటబడింది. పాతరకు ఒక పక్కగా ఒక ఆజానుబాహుడు, కోరమీసాలు సవరించుకుంటూ నిలబడి ఉన్నాడు.

శిఖముఖి అతణ్ణి చూస్తూనే ఆగి పెద్ద గొంతుతో ''గండుపోతూ! నువ్వు చేస్తున్నది అన్యాయ కార్యం. గ్రామవాసులంతా కలిసి దాచుకున్న ధాన్యాన్ని బలం ఉన్నది గదా అని దోచుకుపోవటం ధర్మం అనిపించు కోదు'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే గండుపోతు చర్రునవెనుదిరిగి, శిఖముఖికేసి ఆశ్చర్యంగా చూసి, ''ఎవడ్రా నువ్వూ! శబర శివాలుడి కొడుకువా? నీ గురించి చాలా విన్నాను, ఒకసారి చూశాను కూడా. సవరకుల పెద్ద గండుపోతుకు న్యాయం, ధర్మం బోధ చేయటానికి వచ్చావా? అదేదో చెప్పటం కూడా నీకు చేతకాలేదు!'' అంటూ పక్కన ఉన్న తన భృత్యుల కేసి తిరిగి, ''అలా చూస్తారేం? వాణ్ణీ, వాడి మిత్రుణ్ణీ చెట్టుకు పెడరెక్కలు విరిచి కట్టండి'' అన్నాడు.

గండుపోతు ఇలా అనగానే, అతడి అనుచరులు నలుగురు ముందుకువచ్చి శిఖముఖీ, విక్రమకేసరులను పట్టుకునేందుకు వాళ్ళకేసి నడిచారు. కానీ, శిఖముఖి తన మిత్రుణ్ణి హెచ్చరించి ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు.

అతడి ఉద్దేశం, తమను పట్టుకో వస్తున్న వాళ్ళను ఆ ప్రదేశం నుంచి కొంత దూరంగా తీసుకుపోయి హతమార్చాలని. అలా కాకపోతే, గండుపోతు వెంట ఉన్న తతిమ్మా శత్రువులు తమను చుట్టుముట్టి పట్టుకోగలరు.

శిఖముఖికి వెనకడుగు వేయటం చూసి, గండుపోతు హేళనగా నవ్వుతూ, ''శబర పెద్ద శివాలుడి కొడుకు ఇంత పిరికిపంద అనుకోలేదు!'' అన్నాడు.

ఆ మాట వింటూనే శిఖముఖి రెండడుగులు ముందుకు వేసి, ''గండుపోతూ! వయస్సులో, ఎత్తులో, బలంలో కూడా నా కన్న రెండింతలున్నావు.

నన్ను పట్టుకునేందుకు నీ భృత్యుల్ని పంపటం ఎందుకు? నువ్వే ఆ పని చేయకూడదా?'' అన్నాడు.

గండుపోతు కళ్ళు నిప్పులు చెరిగినై, అతడు ఒకసారి హుంకరించి, ఎడంచేత్తో మీసం మెలివేస్తూ, ఈటె పైకెత్తి, ''నీవు చావుకోరి ఇక్కడి కొచ్చినట్టుంది. ఇదిగో వస్తున్నాను, కాచుకో!'' అంటూ ఈటెను శిఖముఖి గుండెలకేసి గురిచేసి, కుప్పించి ముందుకు దూకాడు. (ఇంకా వుంది)





# అనుమానం మనిషి



కిరాణా కొట్టు నడిపే పరంధామయ్య మహా అనుమానం మనిషి. పైగా, తానే అందరి కన్నా తెలివైనవాడిననుకుంటూ, తన వద్ద పనిచేసే గుమాస్తాలను చిన్నచూపు చూస్తుంటాడు.

ఒకసారి సరుకులు కొనడానికి పరంధామయ్య స్నేహితుడు గుర్నాథం, ఆ కొట్టుకు వెళ్తే, తనకు ఒక మంచి గుమాస్తా కావాలనీ, తెలిసిన వాళ్ళెవరైనా వుంటే చూడమనీ, గుర్నాథాన్ని అడిగాడు పరంధామయ్య.

గుర్నాథం వుండే వీధి చివరలో, రంగడు అనే కుర్రవాడున్నాడు. వాణ్ణి వెంటబెట్టుకుని పరంధామయ్య దగ్గరకు వెళ్ళాడు, గుర్నాథం.

పరంధామయ్య, రంగణ్ణి, ''నీకు డబ్బు లెక్కలు బాగా వచ్చా?'' అని అడిగాడు. వచ్చునన్నట్టు తలూపాడు రంగడు.

పరంధామయ్య పక్కగదిలోకి వెళ్ళి, ఒక నోట్లకట్టతో తిరిగి వచ్చి, ''ఈ కట్టలో ఐదు వేల రూపాయలుండాలి. సరిగ్గా వున్నాయో లేవో లెక్కపెట్టు!'' అంటూ రంగడి చేతికిచ్చి, పక్క గదిలోకి వెళ్ళి తాపీగా లెక్కపెట్టుకు రమ్మన్నాడు. రంగడు గదిలోకి పోగానే పరంధామయ్య, గుర్నాథంతో, ''ఈకాలంలో ఎవర్నీ నమ్మడానికి వీల్లేదు. ఈ కుర్రాడికి ఐదువేల రూపాయలకట్ట ఇచ్చానా! అందులో వందయాభై రూపాయల నోట్లుంటే, ఒక నోటు ఎక్కువగా పెట్టాను. వాడు అదనంగా వున్న నోటును జేబులో వేసుకుని, కట్టలో ఐదు వేలు సరిగ్గా వున్నాయని అంటాడు. వాడి అసలు రంగేమిటో బయటపడుతుంది!'' అంటూ నవ్వసాగాడు. అంతలో రంగడు అక్కడికి వచ్చి, నోట్లకట్టను పరంధామయ్యకిచ్చాడు. ఆయన రంగడిని, ''ఏం, డబ్బు సరిగావుందా?'' అని అడిగాడు. ''లేదండీ, ఒక్క యాభై నోటు తక్కువుంది,'' అన్నాడు రంగడు.

''ఒరేయ్, నువ్వు సరిగ్గా లెక్క పెట్టలేదు. నీకు లెక్కలు రావు. చూడు, ఇప్పుడు మళ్ళీ లెక్క పెడదాం,'' అని పరంధామయ్య కోపంగా

కోలపల్లి చిన్నబాబు

అరిచి, ''గుర్నాథం! ఈ నోట్లకట్టలో ఎంతు న్నదో, నువ్వుకాస్త లెక్క పెట్టిచూడు,'' అంటూ నోట్లకట్టను గుర్నాధానికి ఇచ్చాడు. గుర్నాథం నోట్లను లెక్కించి, ''ఇందులో తొంభైతొమ్మిది నోట్లేవున్నాయి,'' అన్నాడు.

''అలాగా! ఇదంతా మోసం. నేను నూటా ఒక్కనోట్లు ఇస్తే, రెండు నోట్లు మాయం చేసి తొంభైతొమ్మిదే వున్నాయంటావా? వెధవా నీ సంగతి చెబుతాను,'' అంటూ పరంధామయ్య ఆవేశంగా లేచి, రంగడి చొక్కా లాగు జేబులన్నీ వెదికాడు. గదిలోకి వెళ్ళి అంతటా వెదికాడు. ఎక్కడా డబ్బు కనిపించలేదు. అప్పుడు గుర్నాథం, పరంధామయ్యతో, ''నీవే తప్పుగా లెక్కించి వుంటావు. ఈ రంగణ్ణి అనవస రంగా అనుమానిస్తున్నావు. సరే, వేరే కుఱ్ఱా డిని చూసుకో!'' అంటూ బయటికి నడిచాడు.

వీధిలో కొద్దిదూరం నడిచి మలుపు తిరిగాక, రంగడు గుర్నాథంతో, ''అయ్యా, నిజానికి కట్టలో నూటా ఒక నోట్లున్నాయి. పరంధామయ్య చాలా అనుమానం మనిషని అందరూ చెప్పుకుంటారు. అనుకున్నట్టే కట్టలో ఒక నోటు ఎక్కువవుంది. అది నన్ను పరీక్షించడానికన్న మాట. ఆ సంగతి ఆయన మీతో చెప్పడం కూడా విన్నాను. అందుకే దాంతో పాటు మరొక నోటు కూడా తీసి దాచేశాను. అనవసరంగా గుమాస్తాల నిజాయితీని అనుమానించే యజమాని వద్ద అనుక్షణం అవమానంతో పనిచేయడంకన్నా భిక్షమెత్తుకోవడం మేలు. నేను ఆయన వద్ద పనిచేయలేను. ఈ డబ్బు తీసుకెళ్ళి మీరే ఆయనకివ్వండి,'' అంటూ తాను వేసుకున్న లాగుపట్టీలోంచి రెండు యాభై రూపాయలనోట్లు పైకిలాగి గుర్నాథం చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

గుర్నాథం రంగణ్ణి మెచ్చుకుంటూ ఆ డబ్బు తీసుకుని పరంధామయ్య దగ్గరికి తిరిగి వెళ్ళి జరిగింది చెప్పి, ఆయనకు నోట్లు ఇస్తూ, ''పరంధామయ్యా, నువ్వు పరమ అనుమానం మనిషివని ఊరూ వాడా ఎరిగిందే. అది నీకు మేలు కన్నా కీడే ఎక్కువ చేస్తుందని రంగడు రుజువుచేశాడు. ఆలోచించి చూడు,'' అని అక్కణ్ణించి వెనుదిరిగాడు.

ఆసంఘటనతోపరంధామయ్యలో మార్పు వచ్చింది. ఆ నాటి నుంచి గుమాస్తాలను అనవసరంగా అనుమానించి కించపరచకుండా అందరిచేతా మంచివాడనిపించుకున్నాడు.





# బహుమతి - తగు రీతి

ఈ రోజు నా పుట్టిన రోజు. పొద్దున్నే గుడికి వెళ్ళాము. ప్రసాదం ఎంత బావుందో. కానీ కొంచెమే ఇచ్చారు. హుండీలో ఎక్కువ డబ్బులు వేస్తే ఎక్కువ ప్రసాదం ఇస్తారేమో అనుకున్నాను.

సాయంత్రం మా ఇంట్లో పండగ. ఒక్కొక్కరే నా స్నేహితులందరూ వచ్చారు. పుట్టిన రోజు శుభాకాంక్షలు చెబుతూ బహుమతులు అందించారు. సాయంత్రమంతా ఎంతో సరదాగా గడిచిపోయింది. వెళ్ళేటప్పుడు అందరికీ గుర్తుగా చిన్న బొమ్మా, బుడగా ఇచ్చాము. అందరూ వెళ్ళాక బహుమతులు తెరిచి చూసుకున్నాను. రమణి అందరికంటే ఖరీదైన బహుమతి ఇచ్చింది. కావ్య ఏమో నాకిష్టమైన పుస్తకం ఇచ్చింది. గీత నా కోసం తనే ప్రత్యేకంగా మంచి బొమ్మ గీసి, వెనక, ప్రియమైన నేస్తానికి పుట్టిన రోజు శుభాకాంక్షలు అని రాసి ఇచ్చింది.

''అంత విలువైన బహుమతి ఇచ్చిన రమణికి కూడా మనం అందరిలాగే చిన్న బొమ్మ ఇచ్చాము, బావుంటుందా?'' అన్నాను నేను.

అప్పుడు అమ్మ ఇలా చెప్పింది. ''రమణి వాళ్ళు బాగా డబ్బున్న వాళ్ళు. వాళ్ళు అందుకే పెద్ద బహుమతి కొనగలిగారు. అదే మీ కావ్య, నీకు బాగా సన్నిహితురాలు కనుక నీకు ఏది ఇష్టమో తెలుసుకుని తీసుకువచ్చింది. ఇక గీత బొమ్మలు బాగా వేయగలదు కనక నీకు మంచి బొమ్మ వేసి ఇచ్చింది. మనమేమో, ఎవరు ఎటువంటి బహుమతి ఇచ్చినా మన ఇంటికి వచ్చినందుకు గాను అందరికీ మనకి నచ్చే వస్తువులు ఇచ్చి పంపాము.''

అంటే, ''గుడికి వెళ్ళినప్పుడు హుండీలో ఎవరు ఎన్ని డబ్బులు వేసినా అందరికీ తీర్థ ప్రసాదాలు ఒకేలా ఇస్తారు కదా, అలాగన్న మాట'' అన్నారు నాన్న నవ్వుతూ.

– గోదావరి లలిత





# మాయాంకుడు - మామిడిటెంక

మాయాంకుడు ఎనిమిదేళ్ల అల్లరి బాలుడు. తండ్రిలేని పిల్లాడని తల్లి గారాబంతో పెంచింది. చదువు సంధ్యలు లేక అల్లరి చిల్లరిగా తిరిగే కొడుకును ప్రయోజకుడ్ని చేయాలని తల్లి వాడిని ఒక సాధువు వద్దకు తీసుకువెళ్లింది. తల్లి కష్టమంతా విన్న సాధువు, ''నాయనా, నీకు ఒక మాయా మామిడి టెంకను ఇస్తాను. నీవు బుద్ధిమంతుడివై, అల్లరి మానేసి, రోజూ చదువుకుంటూ, ఈ టెంకను నాటి దానికి నీళ్లు పోయాలి. నీకు 21 ఏళ్లు వచ్చేసరికి ఈ మామిడి టెంక మామిడి చెట్టయి, డబ్బును కాస్తుంది. కాని నీవు తల్లి చెప్పిన మాట వినకపోతే ఈ టెంక మహిమ పోతుంది.'' అని చెప్పి ఒక మామిడి టెంకను ఆ బాలుడికి ఇచ్చాడు సాధువు.

అప్పటి నుంచి అల్లరి మానిన మాయాంకుడు టెంకను ఇంటివెనుక బీడులో నాటి, రోజూ దానికి నీళ్లుపోసేవాడు. ఆ టెంక మామిడి చెట్టయి, తీయటి మామిడి పండ్లు కాసింది. ఆ పండ్లను ఇంటిల్లిపాదీ తినగా మిగిలిన టెంకలను తిరిగి బీడు భూమిలో నాటాడు. ఒకప్పుడు బీడుగా ఉండే ఆ నేల ఇప్పుడు హరితవనం అయింది.

చాలా కాలం తర్వాత ఆ సాధువు వారి గ్రామానికి వచ్చాడు. మాయాంకుడు తన తోటలోని మామిడి పండ్లు ఆ సాధువుకు కానుకగా సమర్పించాడు. ఆ సాధువు అప్పుడు ఇలా అన్నాడు. ''నాయనా! నేను ఆ రోజు ఇచ్చిన ఆ టెంకలో ఏ మాయా లేదు. నీవు నీ కష్టం, కృషి, పట్టుదలతో బీడును హరితవనంగా మార్చావు. ఈ వనంలో పండిన మామిడి పండ్లను అమ్మి డబ్బు చేసుకో. ఆనాడు నేను ఇచ్చిన మామిడి టెంక నీకు డబ్బు ఇస్తుందని చెప్పానుగా. నీవు నీ కష్టంతోనే డబ్బు సంపాయించుకున్నావు.'' మాయాంకుడికి శ్రమించడంలోని విలువ బోధపడింది. తల్లి కోరిక, సాధువు సలహాతో అతడు ప్రయోజకుడయ్యాడు.

– శ్రీలేఖ కొచ్చెర్లకోట



# బాలవాణి
వాయిస్ ఆఫ్ చిల్డ్రన్



## గ్రామ నివేదిక





వాగ్దానం చేసినట్లుగానే, మేము బాల విలేకరులనుంచి మరిన్ని కథనాలను తీసుకువస్తున్నాము. ఈసారి బాలవాణి (వాయిస్ ఆఫ్ చిల్డ్రన్) అతి పెద్ద రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్ నుండి వచ్చింది. ఇక్కడి యునిసెఫ్ భాగస్వామి అయిన సారథి డెవలప్‌మెంట్ ఫౌండేషన్, పిల్లలు తమ రోజువారీ చదువుతోపాటు సామాజిక బాధ్యతలను కూడా ఎలా ప్రారంభించారో తెలిపే కథనాలను మీముందుకు తీసుకు వస్తోంది.

సునీతా ఆంటీ మా పొరుగున ఉంటోంది. ఒకరోజు జూదంలో పందెం కాయడానికి రూ. 200లు కావాలని అంకుల్ ఆమెను డిమాండ్ చేశాడు. ఆమె కాయకష్టం చేసి అతి కష్టం మీద రూ. 200లు కూడబెట్టుకుంది. డబ్బు ఇచ్చేది లేదని ఆంటీ తేల్చి చెప్పడంతో అంకుల్ ఆమెను బాగా కొట్టాడు. ఇలాంటి శారీరక హింస ఘటనలు తరచుగా జరుగుతుంటాయి. ఈసారి మాత్రం సునీతా ఆంటీ ఎంతగానో కుమిలిపోయింది. ఆమె ఒక నిర్ణయానికి వచ్చి ఒంటిపై కిరోసిన్ ఆయిల్ పోసుకుని తన్నుతాను మంటల్లో తగులబెట్టుకోవాలని అనుకుంది. సరిగ్గా ఆ సమయంలోనే అంకుల్ ఆమెను అడ్డగించి ఇకపై జూదం కోసం డబ్బులు తగలెయ్యనని హామీ ఇచ్చాడు. కష్టపడి సంపాదించిన డబ్బు విలువ మనుషులు తెలుసుకోవాలని, తమ భార్యలను వారు గౌరవించాలని కోరుకుంటున్నాను.

– సుజీత్ పరిహార్, జీరోన్ గ్రామం

పార్వతీ యాదవ్‌కు మా గ్రామంలో ఒక రేషన్ షాపు ఉంది. ఆమె గత 26 ఏళ్లుగా ఈ షాపును చూసుకుంటోంది. ప్రతి నెలా ఆమె షాపును రెండుసార్లు తెరిచి రేషన్ సరుకులు, కిరోసిన్ ఆయిల్ సరఫరా చేస్తూ ఉంటుంది. ఆమె గ్రామ పెద్దకు, ఊరిలోని మోతుబరులకు మాత్రమే సరకులు అమ్ముతూ ఉంటుంది. గ్రామంలోని పేద ప్రజలను ఎవరూ పట్టించుకునేవారు కాదు. ఆమె దుకాణంలో, వారు సరకులు కొనగలిగే వారు కాదు.

– శివానీ శివహారే, జమాల్‌పూర్ గ్రామం

మా గ్రామంలో ప్రధాన మార్గానికి దగ్గరలో ఒక చేతి పంపును అమర్చారు. గ్రామస్తులకు ఈ చేతి పంపే ప్రధానమైన నీటి వనరుగా ఉండేది. ఆ ప్రాంతంలో చేతి పంపులకు కొరత కారణంగా అక్కడ ఎప్పుడూ జనం గుమికూడి ఉండేది. దీంతో మహిళలు ఒంటరిగా స్నానం చేయాలంటే అసౌకర్యంగా ఉండేది. దీనివల్ల మహిళలు చాలా ఇబ్బందికర పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చేది. దీంతో పిల్లలపై చెడు ప్రభావం పడేది.

– రోషిణి పటేల్, 8వ తరగతి, సగౌరియ

మా గ్రామంలో బాలబంధు కార్యక్రమం నిర్వహించినప్పటి నుండి బాలికల పుట్టినరోజును



సంబరంగా జరుపుకునే వారు. బాలుర కంటే బాలిక లను తక్కువ చేసి చూడ కుండా, వారిని సమానంగా చూడటంలో బాల బంధు కార్యక్రమం గ్రామీణులకు సాయపడింది. బాలికల ప్రాధాన్యతను గ్రామీణులు అర్థం చేసుకు న్నారు, ఇప్పుడు బాలికల పుట్టినరోజును బహిరంగంగానే జరుపుకుంటున్నారు.

– రాజా పర్మార్, క్లాస్–7, జమాల్పూర్

మా పాఠశాల పేరు పూర్వ మాధ్యమిక్ విద్యాలయ్. స్కూలు ప్రధానోపాధ్యాయు రాలు ప్రతి రోజు పాఠశాలకు ఆలస్యంగా వస్తుంది. స్కూలు ఉదయం 7 గంటలకు ప్రారంభమయితే, ఆమె 8 గంటలకు వస్తుంది. బడి 8.30 గంటలకు మొదల యితేఆమె క్లాసుకు 10 గంటలకు వస్తుంది. మా బడిలో క్లాసులు సరిగా నిర్వహించరు.

– షాలిని ద్వివేది, క్లాస్–8, పురకల

గతంలో మా గ్రామ స్వీపర్ తరచుగా పని ఎగ్గొట్టేవాడు. ఒకరోజు అతడు పనిలోంచి వెళ్లిపోతుంటే నేను, నా మిత్రులతో కలిసి అతడిని నిలేశాము. ప్రభుత్వం తన పని కోసం క్రమం తప్పకుండా జీతాలు ఇస్తు న్నప్పటికీ తాను ఎందుకు పనిచేయలేదని అడిగాము. బాలవాణి పత్రిక సహాయంతో అతడిపై ఆరోపణ చేస్తామని చెప్పాము. ఈ పత్రిక దేశవ్యాప్తంగా, అంతర్జాతీయంగా కూడా పంపిణీ అవుతోందని, అతడి గురించి ప్రజలకు బాగా తెలిసి పోతుందని, దీంతో తనకు వచ్చే జీతం కూడా నిలిచిపో తుందని చెప్పాము. అతడు జైలుకు పోయే అవకాశం ఉందని బెదిరించాము. అతడు ఎంతగా భయపడ్డాడంటే మర్నాటినుంచి క్రమం తప్పకుండా పనిలోకి రావడం మొదలె ట్టాడు. ఇప్పుడు మా ఊరు పరిశుభ్రంగా ఉంది.



– మదన్ సాహు, 10వ తరగతి, తెరాయ్ ఫాటక్

బాల విలేకరి శిక్షణ పూర్తి చేసుకున్న తర్వాత మేము యథాప్రకారంగా పాఠశా లకు వెళ్లడం మొదలెట్టాము. మేం తిరిగి వచ్చాక మా టీచర్లు కూడా చాలా సంతోషం గానూ, గర్వంగాను ఉండేవారు. తమ స్కూలు చక్కటి గుర్తింపు తెచ్చుకుంటుం దని, బాలవాణి పత్రిక చదువుతున్న పాఠ కులు ఈ పాఠశాలలో చెబుతున్న విద్య చాలా బాగుందని తెలుసుకుంటారని వారు భావించి పొంగిపోయేవారు.

– బబితా యాదవ్, 10వ తరగతి, పట్టారన్

స్కూల్‌లో నాకు రాణి అనే మిత్రురాలు ఉంది. ఆమెకు నేను బాలవాణి పత్రికను చూపగానే, బడికి వెళ్లలేకపోయిన అమలేష్ అనే బాలిక గురించి నాకు చెప్పింది. నేను తన ఊరికి వెళ్లి ఆమెతో, ఆమె తల్లిదండ్రు లతో మాట్లాడి వారికి బాలవాణి పత్రికను చూపించాను. వారు దాంతో సమాధానపడి తమ కూతు రును పాఠశాలకు పంప సాగారు. – మౌసమ్ పటేరియా, 6వ తరగతి





# నేరుగా పిల్లల డెస్క్ నుంచి...



## మౌసమ్ పటొరియా, సునోరి




కొన్నేళ్ల క్రితం మా ఊరి చెరువు సమీపంలో ఒక మహిళ పెద్ద బండరాయిమీద దుస్తులను ఉతుకుతూ ఉండేది. బండ చుట్టూ నీళ్లు ఉండటంతో ఆమె నిలబడిన ప్రాంతం పాచి పట్టి జారుతుండేది. ఒకరోజు ఉన్నట్లుండి రాయి జారిపోగా నీళ్లలో పడి తీవ్రంగా గాయ పడిన ఆ మహిళను ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్పించారు. తర్వాత ఊరి పెద్ద, చెరువు గట్టున సిమెంట్ మెట్లు కట్టించారు. ఇప్పుడు అక్కడ జారిపడటం, నీళ్లలో పడిపోవడం వంటివి జరగటం లేదు. బాలవాణి తరపున మా ఊరి పెద్దకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.



## సంగీతా రాజా, సునోరి



మా గ్రామంలో మరుగుదొడ్లు కట్టడానికి ఇటుకలు, సిమెంట్ సరఫరా చేశారు. గ్రామాధికారి రమేష్ అహివార్ 15 మందికి మాత్రమే సరిపోయే టాయ్‌లెట్‌లను కట్టించారు. మిగిలిన వాటి విషయం ఏమిటని మేం అడిగితే మాకు సమాధానం చెప్పడం తన పనికాదని బదులిచ్చాడు. మేము బాల విలేకరులమని, మా బాలవాణి పత్రికలో అతడి తప్పు పనులను ప్రచురిస్తామని చెప్పాము. వెంటనే అతడు మా డిమాండ్లను అంగీకరించడమే కాకుండా మిగిలిన టాయ్‌లెట్‌లను కూడా కట్టిస్తామని హామీ ఇచ్చాడు.



జలధార రాజ్‌పుత్
6వ తరగతి, జమునియా





మా ఊరిలో నీళ్లకు కటకటగా ఉంది. ఊరు మొత్తానికి రెండే రెండు చేతి పంపులున్నాయి. వీటిలో ఒకటి ఎల్లప్పుడూ మొరాయిస్తూనే ఉంటుంది. దీంతో మిగిలి ఉన్న చేతిపంపువద్ద జనం కిక్కిరిసిపోతూ ఉండేవారు. పొడవాటి క్యూలలో నిలబడి జనం బక్కెట్లలో నీళ్లు పట్టుకు పోతూం టారు. స్నానం చేయడానికి కూడా జనం బాగా ఇబ్బంది పడుతుంటారు.

కిరోన్
7వ తరగతి, జీరోన్






మా ఊరికి రెండు బస్సులు మాత్రమే వస్తున్నాయి. ఆ రెండు బస్సులలోనూ జనం కిక్కిరిసిపోతుంటారు. మగవారు తరచుగా బస్సుపై భాగం మీదికి ఎక్కి ప్రయాణిస్తుంటారు. పరుగెత్తుకుంటూ వచ్చి వారు బస్సు ఎక్కుతుంటారు. గతంలో నా మిత్రులు అరవింద్, అజబ్ సింగ్ బస్సులోంచి కింద పడిపోయారు కూడా. పోలీసు అధికారులు ఇలాంటి చర్యలపై నిఘా పెట్టాలని కోరుతున్నాను. ప్రయాణీకుల సౌకర్యం కోసం మరిన్ని బస్సులను వేయాలని కోరుతున్నాను.

చందమామ పాఠకులారా! మీ అభిప్రాయం వినడానికి ఎంతో మక్కువ చూపుతున్నాము. బాలవాణి ప్రస్తావించిన అంశాలపై, ప్రత్యేకించి మీ హక్కులపై మీ వ్యాఖ్యలు/అభిప్రాయాలు మాకు తప్పక పంపండి. **http://www.facebook.com/unicefindia** లో పిల్లల హక్కులు.





# పోలండ్ జానపద కథ

## కొంగముక్కు రాజు

నూరేళ్ళ క్రితం వరకు ఉత్తర పోలండ్ ప్రజలు రకరకాల చెట్లతో నిండిన ఒక చిన్న లోయకేసి చూపెడుతూ, ''ఇక్కడే ఒకానొకప్పుడు అద్భుత శక్తులు కలిగిన వ్లాడిమీర్ ఆపిల్ చెట్టు ఉండే దట! అది ఇప్పుడు కూడా ఉంటే ఎంత బావుండేది!'' అని చెప్పుకునేవారు.

ఈనాడు అక్కడొక పట్టణం ఏర్పడడంతో ఆ పచ్చటి లోయకూడా కనుమరుగైపోయింది. అయినా – వ్లాడిమీర్, అతడి వింత చెట్టును గురించిన విచిత్రమైన కథ మాత్రం ఆ దేశపు పూర్వగాథలలో చిరస్థాయిగా నిలిచిపోయింది:

ఉత్తర పోలండ్‌కు చెందిన ఒక మహిళకు కొంత కాలం సంతానం లేకపోయింది. ఆమె దేవాలయానికి వెళ్ళి సంతానం కోసం ప్రార్థిం



చినప్పుడు ఒక వింత వాణి వినిపించిన అను భూతికి లోనయింది. ఆమెకు అసాధారణ మైన కొడుకు పుడతాడనీ; వాడు ధనవం తుడో, నిత్య సంతోషిగానో అవుతాడనీ; ఆ రెండింటిలో ఏది కావాలో కోరుకోమనీ వింత వాణి ఆదేశించింది.

సంతోషం కలిగించే వివిధ వస్తువులలో, విషయాలలో ధనం ఒకటి మాత్రమే అవు తుంది. అది లేకుండానే సంతోషంగా ఉండ గలిగినప్పుడు ఇక ధనం ఎందుకు? దాని వెంట వచ్చే బాదర బందీ ఎందుకు? అని ఆలోచించిన ఆమె తనకు నిత్యసంతోషి అయిన కొడుకే కావాలని కోరుకున్నది.

ఆమెకు కొన్నాళ్ళకు పండంటి కొడుకు పుట్టాడు. వ్లాడిమీర్ అని పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచసాగింది. ఆమె పేదరాలు కావడంతో బిడ్డను, దూరంగా ఉన్న బడికి పంపలేక పోయింది. కొన్నాళ్ళకు అతన్ని బూట్లు కుట్టే పని నేర్చుకోమని ఒక పెద్ద చర్మకారుడి వద్దకు పంపింది. వ్లాడిమీర్ కొన్నాళ్ళు చర్మకారుడి ఇంటి వద్దే ఉన్నాడు గాని, ఒకనాడు తన ఇంటికి తిరిగివచ్చి, ''అమ్మా, బూట్లు కావాలని వచ్చే వారం దరూ ధనికులే. పేదలకు బూట్లు కొను క్కునే శక్తిలేదు. ధనికులకు మాత్రమే పనికి వచ్చే వృత్తి నాకు ఇష్టం లేదు,'' అని చెప్పాడు.

తల్లి సరేనని తల ఊపి, అతన్ని కుట్టు పని నేర్చుకోమని ఒక దర్జీ వద్దకు పంపింది. వ్లాడిమీర్ అక్కడ పని నేర్చుకోసాగాడుగాని,



కొన్నాళ్ళకే అక్కడి నుంచీ తిరిగి వచ్చి, ధని కులు మాత్రమే కుట్టించుకున్న బట్టలు తొడుక్కుంటున్నారు; అలాంటివారికి సేవలు చేయడం తనకు ఇష్టం లేదని తల్లికి చెప్పాడు.

ఆ తరవాత తల్లి అతన్ని ఖడ్గాలు తయారుచేసే నిపుణుడి వద్దకు పంపింది. ఆ రోజుల్లో తరచూ యుద్ధాలు జరిగేవి గనక, ఖడ్గాలకు మంచి గిరాకీ ఉండేది. అయితే, వ్లాడిమీర్ అక్కడ కూడా ఒక వారం రోజులకు మించి ఉండలేక పోయాడు. ''అమ్మా, మనుషులను చంపే ఆయుధాలను నేను తయారు చేయాలా?'' అన్నాడు బాధగా

''వద్దు నాయనా. అయినా, నీకు నచ్చిన జీవనోపాధిని చూపలేక పోతున్నాను. అదే నాకు బాధగా వుంది,'' అని కొంతసేపు ఆలోచించిన తల్లి, ''గ్రామంలోని ఇతర పిల్లల్లాగే నువ్వూ, పశువులను దాపులనున్న మైదానాలలోకి తోలుకు వెళ్ళి మేపుకుని, రా,'' అన్నది.

వ్లాడిమీర్ తల్లి సలహాను పాటించాడు. పశుల కాపరులతో కలిసి మెలిసి ఆడుతూ, పాడుతూ పచ్చటి పొలాలగుండా తిరుగుతూ, పశువులను కాపలాకాయడం అతనికి ఎంతో ఆనందం కలిగించింది. ఒకరోజు మిట్టమధ్యాహ్న సమయం. ఎత్తయిన ఒక బండ చుట్టూ నిప్పంటు కోవడం వ్లాడిమీర్ గమనించాడు. ఆ బండ మీద ఉన్న ఒక తొండ, నిప్పుల నుంచి బయట పడడానికి ప్రయత్నిస్తున్నదిగాని, సాధ్యపడలేదు. వ్లాడిమీర్ తన వద్ద వున్న పొడవాటి కర్రను ఉపయోగించి తొండను అగ్నిజ్వాలల నుంచి కాపాడాడు. మరుక్షణమే ఆ తొండ ఒక వృద్ధురాలిగా మారి, ''నాయనా, నీ ఉపకారగుణం మెచ్చ తగింది. ఇదిగో ఈ మొక్కను తీసుకుపోయి, నీ పెరట్లో నాటు. ఈ చెట్టు నుంచి కాచే ఆపిల్ పళ్ళకు వ్యాధులను నయం చేసే అద్భుత శక్తి ఉంటుంది,'' అంటూ ఒకమొక్కను ఇచ్చి, తొండగా మారి పొదలోకి వెళ్ళిపోయింది.

వ్లాడిమీర్ ఆ మొక్కను తెచ్చి, తన ఇంటి కిటికీ పక్కన తోటలో నాటాడు. రెండు నెలలకల్లా అది ఏపుగా పెరిగి ఫలాలివ్వడం ప్రారంభించింది. వ్లాడిమీర్ మొట్టమొదటి పండును కోసి జ్వరంతో బాధపడుతున్న తన తల్లికి ఇచ్చాడు. వెంటనే ఆమె జ్వరం తగ్గిపోయింది. ఆ తరవాత వివిధ వ్యాధులతో బాధపడుతున్న మరికొందరికి వ్లాడిమీర్ తన ఆపిల్ పళ్ళను ఇచ్చాడు. వాళ్ళ వ్యాధులన్నీ నయమైపోయాయి. ఈ సంగతి కొన్నాళ్ళకు ఆ ప్రాంతాన్ని పాలించే రాజుకు తెలియవచ్చింది. ''మనం వ్లాడిమీర్‌ను మన ఆస్థాన

ఉద్యోగిగా నియమిద్దాం,'' అన్నాడు రాజు.

''అవసరం లేదు, ప్రభూ! వ్లాడిమీర్ చెట్టును తెచ్చి, మన ఉద్యానంలో నాటితే సరిపోతుంది,'' అన్నాడు ఆస్థాన వైద్యుడు.

''అవునవును,'' అంటూ వైద్యుడి మాటకు వంత పలికాడు అతని బావమరది అయిన మంత్రి.

రాజు వెంటనే ఆజ్ఞలను జారీ చేశాడు. సైనికులు వెళ్ళి, వ్లాడిమీర్‌తో ఒక మాట యినా చెప్పకుండా, అతని తోటలోని వింత చెట్టును పెకలించుకుని వచ్చి రాజోద్యానంలో నాటారు. అయితే, ఆ తరవాత ఆ చెట్టు ఒక్క కాయకూడా కాయలేదు. అందరూ ఆశాభంగానికి లోనయ్యారు. రాజవైద్యుడికీ, మంత్రికీ నోట మాటరాలేదు. దీనికి సరైన పరిష్కారం చూడమని రాజు వారిని ఆగ్ర హంతో హెచ్చరించాడు. రాజు కొన్నాళ్ళుగా తీరని జలుబుతో బాధపడుతూ రాజవైద్యుడు ఎన్నిరకాల మందులిచ్చినా అది తగ్గక పోయేసరికి వింత చెట్టు నుంచి కాచే ఆపిల్ పండు కోసం ఎదురు చూస్తున్నాడు.



అదే సమయంలో అక్కడ వ్లాడిమీర్, తన వద్దకు వచ్చే వ్యాధిగ్రస్తులకు ఎలాంటి సాయం చేయలేక పోవడంతో తీరని విచారా నికి లోనయ్యాడు. మైదానంలోకి వెళ్ళి, ఆనాడు తొండకనిపించిన బండసమీపంలోని చెట్టు కింద కూర్చున్నాడు.

''దయాస్వభావం గల తల్లీ, ఒకసారి కని పించవూ,'' అని కళ్ళు మూసుకుని ప్రార్థిం చాడు.

ఉన్నట్టుండి చిన్న సుడిగాలి రావడంతో అతని ముందున్న ఎండుటాకులు గిర్రున గుండ్రంగా తిరగసాగాయి. మరుక్షణమే అక్కడ వృద్ధస్త్రీ కనిపించింది.

వ్లాడిమీర్ ఆమెకు రాజూ, అతని మను షులూ చేసిన దురాగతాన్ని వినిపించాడు. ఆ వృద్ధస్త్రీ, అతనికి ఒక బుట్టనిండా ఆపిల్ పళ్ళను ఇచ్చి, ''వీటిని తీసుకుని రాజభవనం వద్దకు వెళ్ళి విక్రయించు. ఆ తరవాత జరిగే తమాషా చూడు,'' అని చెప్పి, తొండగా మారి, సుడిగాలి వీస్తూండగా పొదలకేసి తిరిగి వెళ్ళి పోయింది.

వ్లాడిమీర్ పళ్ళ బుట్టను తీసు కుని రాజభవనం వద్దకు వెళ్ళాడు, ''పళ్ళో పళ్ళు. ఈ పళ్ళు తింటే అనుకోని అద్భు తాలు జరుగుతాయి,'' అని అమ్మసాగాడు. రాజభటులు అతన్ని రాజు వద్దకు తీసుకు వెళ్ళారు. రాజు అతన్ని చూసి, ''ఈ పళ్ళు, నా జలుబును పోగొట్టగలవా?'' అని అడిగాడు.



''పోగొట్టవచ్చు. ఇంకా మరే దైనా కూడా చేయవచ్చు,'' అన్నాడు వ్లాడిమీర్.

రాజు, మరికొందరు రాజోద్యోగులు తలా ఒక పండు తీసుకుని తిన్నారు. చాలా బావుందన్నారు. అయితే, మరుక్షణమే వారి ముక్కులు పొడవుగా కొంగ ముక్కుల్లా పెరిగి పోయాయి.

''ఏమిటిది?'' అని అరిచాడు కీచుకంఠంతో రాజు హడలిపోతూ.

''ప్రభూ! తమరి జలుబు పోయిందా, లేదా మొదట ఆ సంగతి సెలవివ్వండి,'' అన్నాడు వ్లాడిమీర్ నిర్భయంగా.

''జలుబు ఉందాలేదా అన్న విషయం కూడా తెలుసుకోలేనంత పెద్దముక్కు తయారయింది,'' అన్నాడు రాజు బాధగా.

''ఏమిటిది? ఏమిటిది?'' అన్న హాహాకారాలు బయలుదేరాయి. పళ్ళను తిన్న సభాసదులందరికీ పెద్దపెద్ద కొంగముక్కులు వచ్చేశాయి.

''ప్రభూ, గౌరవనీయులైన తమరూ, తమ ఉద్యోగులూ పెద్ద పెద్ద ముక్కులతో ప్రత్యేకంగా కనిపిస్తున్నారు,'' అన్నాడు వ్లాడిమీర్.

''అంత ప్రత్యేకంగా కనిపించడం మాకిష్టం లేదు. మా పాత మామూలు ముక్కులు ఉంటేచాలు. వాటిని మళ్ళీ ఎలా పొందగలం?'' అని అడిగాడు రాజు అసహనంగా.

''బహుశా, నా తోటలో నుంచి తమరు దొంగిలించిన చెట్టు పళ్ళను తినడం ద్వారానే అది సాధ్యం కావచ్చు. దానిని తీసుకుపోయి యథాస్థానంలో నాటితేనే అది మళ్ళీ పళ్ళు నివ్వగలదు. అంత వరకు గొప్పవారైన తమరు గొప్ప ముక్కులతోనే తిరగక తప్పదు,'' అన్నాడు వ్లాడిమీర్ సాలోచనగా.

ఆ చెట్టును పెకలించి వ్లాడిమీర్ తోటలో నాటడానికి రాజు క్షణాల్లో ఏర్పాటు చేశాడు. ఆ చెట్టు మళ్ళీ ఫలాలివ్వడానికి ఒక వారం రోజులు పట్టింది.

వ్లాడిమీర్ బుట్టనిండా ఆపిల్ పళ్ళతో వచ్చి, వారికి ఇచ్చాడు. వాటిని తినగానే వారికి మామూలు ముక్కులు వచ్చాయి. పెద్ద గండం నుంచి గట్టెక్కినట్టు అందరూ పరమానందం చెందారు.

రాజు వ్లాడిమీర్‌కు తన ఆస్థానంలో ఉన్నత పదవినిచ్చాడు.

అయినా, వ్లాడిమీర్ జీతం పుచ్చుకునే వాడు కాదు. అవసరమని వచ్చిన వారికి అద్భుతశక్తిగల ఆపిల్ పళ్ళను ఇస్తూ సంతోషంగా చిరకాలం జీవించాడు. అతడు కాలధర్మం చెందడంతో, ఆ చెట్టు కాయడం ఆగిపోయింది. – (ఎం.డి)



# బరువుకు తగ్గ న్యాయం



వేదపల్లి అగ్రహారంవాడైన పేరిశాస్త్రి గొప్ప వేదపండితుడు. ఆయనవద్ద ఎన్నో పురాతన గ్రంథాలున్నాయి. జాతి, మత, కుల విభేదాలతో ప్రపంచంలో ఎన్నో హత్యలు, ఎంతో రక్తపాతం జరుగుతుంటే ఆయనకు బాధ కలిగి ఇతర మతాలకు సంబంధించిన ముఖ్య గ్రంథాలు కూడా సంపాదించి, వాటిని క్షుణ్ణంగా చదివాడాయన. అప్పుడాయనకొక అద్భుతమైన విషయం అవగాహన కొచ్చింది.

అదేమంటే ఏ మతమూ హింసను బోధించదు. సర్వమానవ సమానత్వాన్ని శాసించి, లోకకళ్యాణాన్ని కోరుకుంటాయి మతాలన్నీ. మతాలు బోధిస్తున్న మౌలిక సారాన్ని మర్చిపోయి విభిన్న మతాల ప్రజలు ఎవరి మతం గొప్ప అనే గుంజాటనలో నలుగుతూ ఘర్షణ వైఖరి చేపడుతున్నందువల్లే ప్రపంచంలో మత విద్వేషాలు పెరిగిపోతున్నాయి. ప్రజలు దీన్ని గమనిస్తే, ప్రేరేపించబడుతున్న విద్వేషం కనుమరుగై అంతటా సామరస్యం పరిఢవిల్లుతుంది.

ఈ సత్యాన్ని ప్రజలముందు ఉపన్యాసంగా ఇచ్చి అప్పటికప్పుడు శ్రోతలు వెలిబుచ్చిన సందేహాలకు, వారి వారి మత గ్రంథాల నుంచే ఉదాహరణలు ఇచ్చి సందేహ నివృత్తి చేయాలనుకున్నాడు పేరిశాస్త్రి. ఇలా అనుకున్నదే తడవుగా ఆయన తన కార్యక్రమం ప్రారంభించాడు. అందుకోసం ముఖ్య గ్రంథాలన్నీ ఒక కొయ్యపెట్టెనిండా సర్దాడు. దాన్ని మోయడానికి వీరయ్య అనే ఒక కూలీని పెట్టుకుని, దేశసంచారం ప్రారంభించాడు.

ఆరంభంలో పేరిశాస్త్రి ఉపన్యాసాలను ఎవరూ పట్టించుకోలేదు. కానీ ఏ మతస్థుడైనా ఒక సందేహం వెలిబుచ్చితే అప్పటికప్పుడు అతడిముందే అతడి మత గ్రంథాన్ని తీసి అందులో ఉన్న వివరాలను

వసుంధర

చూపించి సందేహ నివృత్తి కావిస్తున్న పేరిశాస్త్రి కొత్త పద్ధతి, ప్రజలపై క్రమంగా ప్రభావాన్ని చూపసాగింది. పేరిశాస్త్రి ప్రత్యక్ష ఆధార పద్ధతి ప్రజలలో బాగా ప్రచారమయింది. ఫలితంగా తమ తమ ప్రాంతాలను సందర్శించవలసిందిగా కోరుతూ ఎక్కడెక్కడినుంచో పేరిశాస్త్రికి ఆహ్వానాలు రాసాగాయి. చాలా సభల్లో పేరిశాస్త్రి తలపెట్టినకార్యక్రమాన్ని అభినందిస్తూ కొందరు ధన, వస్తురూపేణా బహుమతులివ్వడం కూడా ఆరంభించారు.

ఇలా ఒక సంవత్సరం జరిగేసరికి, ఒక పెద్ద జమీందారు ఆయనకు లక్ష రూపాయలు బహుమానంగా ఇచ్చాడు. ఆ తర్వాత మాసం రోజులకు ఆ ప్రాంతాన్నేలే రాజు ఆయనకు రెండు లక్షల రూపాయల బహుమానంతోపాటు గొప్పగా సన్మానం కూడా జరిపాడు.

పేరిశాస్త్రి ఆర్థికంగా లాభపడడమేగాక దేశదేశాంతరాల్లో ఆయన్ని గురించి గొప్పగా చెప్పుకోసాగారు. అయితే పేరిశాస్త్రి గ్రంథాలున్న కొయ్యపెట్టెను మోసుకువచ్చే వీరయ్య క్రమంగా కృశించిపోసాగాడు. అతడి జబ్బేమిటో తెలియకపోయినా చివరకు పేరిశాస్త్రి వాణ్ణి ఒక ధర్మవైద్యశాలలో చేర్పించాడు. అక్కడి వైద్యులు వీరయ్యను పరీక్షచేసి వాడికి శారీరకంగా ఏ జబ్బూ లేదని తేల్చారు.

అది విని పేరిశాస్త్రి ఆశ్చర్యపడి వీరయ్యను ''ఒరే, వీరయ్యా! నువ్వు బయటికి చెప్పకుండా ఏదో మనస్సులో దాచుకుని బాధపడిపోతున్నావు. అదేమిటో చెప్పు'' అని అడిగాడు.

వీరయ్య ఒక పట్టాన చెప్పలేదు. ఆఖరుకు పేరిశాస్త్రి బలవంతంమీద వాడు ''బాబూ.. మీ మతగ్రంథాల బరువంతా



నేను మోస్తున్నాను. పేరూ, డబ్బూ మీకు వస్తున్నది. మీతో పోల్చుకుంటే నాకు వచ్చిన లాభమేమున్నది?'' అన్నాడు.

వాడిలో ఇంత బాధ ఉన్నదని అప్పటి వరకూ పేరిశాస్త్రికి తట్టనేలేదు. ఆయన ఆశ్చర్యపడి వాడికి అర్థమయ్యేలా చెప్పాల నుకుని ''వీరయ్యా.. నువ్వు గ్రంథాలున్న కొయ్యపెట్టెను బండిలో పెడతావు. అక్కడి నుంచి దాన్ని వేదిక మీదికి తెస్తావు. ఈ లెక్కన చూస్తే, నువ్వు రోజుకు రెండు గంటలకంటే దాన్ని మోయడం లేదు. అవునా?'' అన్నాడు.

''అవును. కానీ మీరు కొత్తపద్ధతిలో చేస్తున్న ప్రచారానికి, నేను మోస్తున్న ఆ బరువేకదా పేరు, డబ్బు తెచ్చి పెడుతు న్నది?'' అన్నాడు వీరయ్య.

''నిజమే. ఈ పుస్తకాల బరువును రోజుకు రెండు గంటలపాటు తలమీద మోస్తున్నావు. నీకెప్పుడు బరువు ఎక్కువ అనిపిస్తే అప్పుడు దించుకోగలవు కూడా. కానీ ఈ పుస్తకాల బరువును, నేను తల లోపలి మెదడులో రోజంతా మోస్తున్నాను. ఆఖరుకు నిద్రలో కూడా, ఆ బరువు నేను మోయకతప్పదు. పైగా అది దించుకోలేని బరువు. దీన్నిబట్టి న్యాయం ఏమిటో నువ్వే చెప్పు'' అన్నాడు పేరిశాస్త్రి.

పేరిశాస్త్రి ఎప్పుడెవరు ఏమడిగినా ఠకీమని ఒక పుస్తకం తీసి ఏ పుటలో ఏముందో చెబుతాడని వీరయ్యకు తెలుసు. అందువల్ల వాడు వెంటనే ''నా తప్పు తెలిసింది బాబూ! బరువు మోయ డంలో మేధావిని, కూలివాడితో పోల్చాను. నన్ను మన్నించండి'' అన్నాడు.

అయితే పేరిశాస్త్రి అంతటితో ఊరుకో లేదు. తన ఆదాయంలో వీరయ్యకు మరికాస్త ఎక్కువ భాగమివ్వడమేగాక, పదిమందిలోనూ సర్వమత సామరస్యాన్ని ప్రబోధించడానికి వీరయ్య చేస్తున్నసా యాన్ని పొగడసాగాడు.

వీరయ్య మనోవ్యాధి తగ్గిపోయింది. ఆ తర్వాత నుంచి అతడు, తలమీది నుంచి బరువు దించుకున్నప్పుడల్లా ''పాపం. నా యజమానికి ఇలాంటి అవకాశం రాదు గదా!'' అని జాలిపడుతుండేవాడు.



# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు అక్టోబర్ 2010 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానం పంపిన విజేతకు రూ.500 బహుమతి ఉంటుంది.

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 3 | | 4 | 5 | | 6 |
| | | | | | 6 | | | |
| 3 | 6 | 9 | | | | | | 7 |
| | | 3 | | | 2 | | 4 | |
| | | 8 | | 4 | | 3 | | |
| | 4 | | | | 9 | | | 8 |
| | | 5 | | 2 | | 8 | | |
| | 9 | | 4 | | | 6 | 5 | |
| 6 | | | | | 3 | | 7 | 1 |

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | 3 | 9 | | 8 |
| 8 | | | 6 | 1 | | | 2 | |
| 7 | 9 | | | | | | | |
| 4 | | 9 | | 6 | | | | |
| 3 | 2 | | | | | 5 | | 7 |
| | | | | 9 | | 6 | | |
| | 3 | 4 | 8 | | | | 1 | 5 |
| | | 2 | | | 4 | | | |
| | | | 1 | | | 8 | | |

మీ ఎంట్రీలను 2010 ఆగస్ట్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

e-mail your entries to:contests@chandamama.com

---

జూన్' 10 నెల సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 6 | 7 | 4 | 2 | 1 | 3 | 8 | 9 |
| 8 | 2 | 1 | 5 | 3 | 9 | 7 | 4 | 6 |
| 4 | 3 | 9 | 7 | 8 | 6 | 1 | 2 | 5 |
| 9 | 1 | 4 | 2 | 7 | 8 | 5 | 6 | 3 |
| 2 | 7 | 3 | 1 | 6 | 5 | 8 | 9 | 4 |
| 6 | 8 | 5 | 9 | 4 | 3 | 2 | 1 | 7 |
| 3 | 9 | 2 | 6 | 1 | 7 | 4 | 5 | 8 |
| 1 | 5 | 8 | 3 | 9 | 4 | 6 | 7 | 2 |
| 7 | 4 | 6 | 8 | 5 | 2 | 9 | 3 | 1 |

WINNERS :

N. Navaneeth Goud (Karnataka), K. Kalyan Srinivas (A.P), Shaktirekha roy (Odisha), Arup Ratan Aich (West Bengal), Parimal Singhal (U.P).

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 8 | 3 | 5 | 6 | 2 | 9 | 4 | 7 |
| 7 | 4 | 5 | 1 | 3 | 9 | 8 | 6 | 2 |
| 9 | 6 | 2 | 4 | 8 | 7 | 1 | 3 | 5 |
| 2 | 1 | 8 | 7 | 5 | 3 | 6 | 9 | 4 |
| 3 | 9 | 6 | 2 | 1 | 4 | 5 | 7 | 8 |
| 5 | 7 | 4 | 8 | 9 | 6 | 2 | 1 | 3 |
| 8 | 5 | 9 | 3 | 4 | 1 | 7 | 2 | 6 |
| 4 | 2 | 1 | 6 | 7 | 5 | 3 | 8 | 9 |
| 6 | 3 | 7 | 9 | 2 | 8 | 4 | 5 | 1 |





# అనునిర్వకు వీడ్కోలు

(తన తండ్రి శంతను గుహల పైభాగానికి రాత్రి పూట డ్రాగన్ లాంటి విచిత్రజీవితో కలసి వెళుతున్నట్టు హర్షా, శివతో చెప్పాడు. శంతను ఏం చేస్తున్నాడో చూడాలని హర్షా, శివా నిర్ణయించుకున్నారు)

రాత్రిపూట శంతను గుహల పైభాగంలోకి వెళ్ళడం గమనించగానే, తనను అనుసరించాము. మేము లడ్డూను మాతోపాటు తీసుకెళ్లాము. విచిత్రజీవిని నిప్పుల్లో కాల్చి చంపే క్రూర చర్యకు శంతను మరోసారి పాల్పడ్డాడు. విచిత్రజీవి యధాప్రకారం డాల్ఫిన్‌గా రూపాంతరం చెందింది. శంతను అక్కడినుంచి డాల్ఫిన్ వీపుపై ఎక్కి సముద్రంకేసి బయలుదేరాడు. ఏమాత్రం అనుమానానికి తావివ్వకుండా, మేమూ అతడి వెనకే అనుసరించాము.



శంతను, అతడి మిత్రురాలు సముద్ర తీరంలోని కొండ మీది గుహలోకి ప్రవేశించడం చూశాము. మేము వారిని కలుసుకునే లోపుగా వెనుక నుంచి ఒక శబ్దం వినబడింది.

అతడు రాబిన్, అనునిర్వలో ఉండే చిన్న బొద్దింక. ఇంటివద్ద అయితే, సాధారణంగా బొద్దింకల నుంచి చాలా దూరంగా ఉంటాను. కాని అనునిర్వలో నేను ఆ పని చేయలేకపోయాను. నాకు తెలిసి రాబిన్ వద్ద అపారమైన సమాచారం ఉంటుంది. కాబట్టి అతడిని ఇక్కడ విలువైన సంపదలాగా భావిస్తున్నాను. శంతను-విచిత్రజీవి కలయికపై అతడికి వివరాలు తెలిసి ఉంటే తెలుసుకోవాలని అనుకున్నాను. అయితే రాబిన్ నుంచి నేను విన్నది నిజంగా నన్ను బాగా ఇబ్బంది పెట్టింది. అనునిర్వలో ముఖ్యులతో శంతను తరచుగా రహస్య సమావేశాలు నిర్వహిస్తూ భూమికి తిరిగి రావలసిందిగా వారికి నూరిపోస్తున్నాడు. భూమిని వారికి సురక్షిత స్థలంగా మారుస్తానని, వారు అక్కడ మనుషులకంటే శక్తిమంతులుగా ఉండవచ్చని, వారిని ఎవరూ జయించలేరని శంతను చెబుతూ వారిని ప్రేరేపిస్తున్నాడు.

రాబిన్ చెబుతుండగా హర్షా జోక్యం చేసుకుని, తన తండ్రి జన్యు బ్యాంకును రూపొందించి అనునిర్వలోని అన్ని ప్రాణుల డీఎన్ఏలను సేకరిస్తూ ఉంటాడని, ఆవిధంగా భూమిమీద తనకు ఇష్టమైన ప్రాణులను

సృష్టించగలడని చెప్పాడు. అయితే ఇప్పటికి కూడా హర్షా తండ్రి నిజమైన ఉద్దేశం ఏమిటో నాకు బోధపడటం లేదు. ఈ ప్రమాదకరమైన ప్రయోగానికి అతడు ఎందుకు ప్రయత్నిస్తున్నట్లు?

సమావేశం ముగిసింది. అనునిర్వలో ముఖ్యులైన మయూరి, చీనా ఏనుగు, నైలు నది మొసలి, ఇతరులూ శంతనుతో పాటు కలసి బయటకు వచ్చారు. విచిత్ర జీవి వారిని మెల్లగా అనుసరిస్తూ ఉంది. ఉన్నట్లుండి విచిత్ర జీవితో మాట్లాడి దాని రహస్యాన్ని దాంతోటే చెప్పించాలనే ఆలోచన వచ్చింది. శంతను గమనించకుండా మేం దాన్ని సమీపించాము. మొదట్లో అది మాట్లాడటానికి తటపటాయించింది కాని తర్వాత నోరు విప్పింది. ''నన్ను శంతను సృష్టించాడు. నేను అతడికి విశ్వాసపాత్రురాలిగా ఉండదలిచాను. అయితే హర్షా అతడి సొంత కుమారుడు కనుక నేను రక్తబాంధవ్యాలను కూడా గౌరవించాలి. అందుకే నేను ఈ విషయాన్ని మీకు చెబుతున్నాను. జన్యువుల సమర్థ కలయిక ద్వారా భూమ్మీద ప్రమాదకరమైన జంతువులను సృష్టించడానికి శంతను ప్రయత్నిస్తున్నాడు. భూమ్మీద తాను నియంతగా వెలిగిపోవడానికి జంతువులను పావులుగా వాడుకుంటున్నాడు. అతడు ప్రపంచాన్ని భయకంపితం చేయబోతున్నాడు. కాని అతడు జంతువులను తన బానిసలుగా చేసుకుంటూ వాటిని నానా బాధలకు గురి చేయబోతున్నాడు. వాటిని ఫణంగా పెట్టి అతడు అపారంగా సంపదను ఆర్జించాలని, అధికారం చెప్పు చేతల్లో ఉంచుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.''

విచిత్రజీవి చెప్పిన విషయం వినగానే మేం వణికిపోయాము. దాని కళ్లలోకి సూటిగా చూస్తూ ''చూడు! మీ యజమాని పిచ్చి ప్రయోగాలకు నీవు సహకరించబోతున్నావా?'' అని అడిగాను.

''ఎందుకు సహకరించకూడదు?'' ఆ బానిస జంతువు ఎగాదిగా చూస్తూ జవాబిచ్చింది.

''విను'' చెప్పాను. ''నీ సహాయంతో శంతను క్రూర పథకాన్ని అమలు చేయబోతున్నాడు. నేను చెప్పినట్లు చేయి. నాకు తెలిసిన చోటకు వెళ్లి రహస్యంగా ఉండు. కొద్ది రోజుల పాటు మీ యజమానికి కనబడకుండా దూరంగా ఉండు'' విచిత్రజీవి తలూపింది. తర్వాత మెల్లగా మేము మా గుహలోకి ప్రవేశించాము.





''ఏయ్! మీరెక్కడున్నారు?'' మేం తుళ్లి పడి మా తలలు అటువైపు తిప్పాము. అది నిమ్మీ గొంతు. ఆమె తీక్షణంగా మావైపు చూసి గొణిగింది.

''మీరు మా నాన్నను నీడలాగా వెంటా డుతున్నారని నాకు తెలుసు.'' కాస్సేపు ఊపిరి పీల్చుకుని ఆమె మళ్లీ మాట్లాడింది.

''నాన్న కార్యకలాపాల గురించి మీరు నన్ను అడిగి ఉంటే నేనే చెప్పేదాన్ని. ఎందు కంటే ఇక్కడకి వచ్చిన మొదటి రోజు నుంచే నేను అతడిని దగ్గర్నుంచి పరిశీలిస్తూ వచ్చాను. శివా, అనునిర్వను కనిపెట్టింది మీ తాతయ్య మాత్రమే. మా నాన్న అతడి కింద సహాయ కుడిగా పనిచేశాడు. భూమ్మీద తుడిచిపెట్టు కుపోయిన జంతువులు అనునిర్వకు పంపిం చబడినట్లు మీ తాతయ్యే కనుగొన్నాడు. డాక్టర్ పురంజన్ అనునిర్వలో విశేషాలను బయటపెట్టాలనుకుని శంతనును విశ్వాసం లోకి తీసుకున్నాడు. మా నాన్న చాలా దురా శాపరుడు. ఈ ప్రాజెక్టులో పేరు, కీర్తి, సంపద ఆర్జించడానికి చాలా అవకాశముందని నాన్న కనిపెట్టాడు.

దీంతో పురంజన్‌ని మెల్లగా పక్కకు నెట్టి అతిశయంతో వ్యవహరించడం మొదలు పెట్టాడు.

పురంజన్ తన సహాయకుడి తీరు చూసి ఆగ్రహించాడు కాని శంతను లెక్క పెట్టలేదు. వారు త్వరలోనే విడిపోయారు. ప్రారంభ ప్రయోగంలో భాగంగా మయూరిని శంతనుడే అనునిర్వకు పంపాడు.

ఆమెను మళ్లీ మానవరూపంలోకి మారు స్తానని ఆమెకు ఆశచూపాడు. ఆమె సహా యంతో ఇతర ప్రాణులను కూడా భూమ్మీ దకు మళ్లీ రావలిసిందిగా నచ్చచెప్పాడు.

దైవాంశ సంభూతుడిగా తనను తాను ఆవిష్కరించుకుని ఈ ప్రాణులను బాని సలుగా చేసుకుని భూమిని ఏలాలన్నదే అతడి ఏకైక కోరిక. అతడి పథకాలను నీవు విఫలం చేయాలనుకుంటే నేను కూడా నీకు సహకరిస్తాను.''

నాలో తుఫాను బయలు దేరింది. ఈ దుష్టబుద్ధి మనిషి క్రూర పథకాన్ని ఆపడ మెలా? తాతయ్య అతడి దుష్టతలంపులో భాగం పుచ్చుకోకపోవడం నాకు ఊరట నిచ్చింది. శంతను పథకాన్ని అడ్డుకోగల శక్తి తాతయ్యకు మాత్రమే ఉంది. వెంటనే తన వద్దకు వెళ్లి నాకు తెలిసిన సమాచారం మొత్తంగా చెప్పాను. ఈ విషయమ్మై మేం చాలాసేపు సుదీర్ఘంగా ఆలోచించి నిద్రపో యాము.

ఆ మరుసటి దినం నేను తాతయ్యతో కలిసి మయూరి, ఇతర ప్రముఖులతో శంతను సమావేశమ్మై చర్చించే సముద్ర తీర గుహవైపుకు దారితీశాము. శంతను పథకాన్ని అంగీకరించే విషయంలో మయూరి ఇప్పటికే

అనునిర్వ ప్రాణులను కూడగట్టి ఉంటుంది. శంతనుపై ఆమెకు గల విశ్వాసాన్ని కాస్త భగ్నపర్చగలిగినట్లయితే నేను ఒకమేరకు విజయం సాధించినట్లే.

మేము గుహలోకి ప్రవేశించగానే, అక్కడ హాజరైన ప్రాణులు కలవరపడ్డాయి. శంతను అయితే దిగ్భ్రాంతి చెందాడు. అయితే మా తాతయ్య మానసికంగా కదిలి పోయిన స్థితిలో కనిపించాడు. మెల్లగా పెదవులు తెరిచి మాట్లాడాడు.

''ఇతడు నా మనమడని మీకందరికీ తెలుసు. నేను అతడిని ఎంతగానో అభిమానిస్తాను. కాని నేను ప్రత్యేకించి అనునిర్వ ప్రాణులతో జన్యు ప్రయోగాలు చేస్తున్నానని తెలిసి నన్ను ద్వేషించడం మొదలు పెట్టాడు. కాబట్టి నేను నా జీవితాన్ని వదిలిపెట్టాలనుకుంటున్నాను. కాని నేను చివరి శ్వాస వదిలేలోపు నా మనవడిని మయూరి సంరక్షణలో ఉంచాలనుకుంటున్నాను. తర్వాతే నేను ప్రశాంతంగా కన్నుమూస్తాను'' తాతయ్య ముగించగానే శంతను ముఖకవళికలు ఉన్నట్లుండి మారాయి. అతడు ఆనందంతో పొంగిపోతున్నాడు.

''హేయ్ ముసలాయనా! శివ సంరక్షణ విషయం నేను వ్యక్తిగతంగా చూసుకుంటాను. నిన్ను స్వర్గానికి ప్రశాంతంగా పంపించనివ్వు!'' అంటూ ఉన్నట్లుండి అతడు ఒక పెట్టెలోంచి సూది తీసుకుని తాతయ్య చేతిలో బలంగా గుచ్చాడు.

బాధ తట్టుకోలేక తాతయ్య అరచి నేల మీద కుప్పగూలిపోయాడు. కొద్ది నిమిషాల్లోనే తాతయ్య చనిపోయాడు. శంతను ఎగిరి గంతేశాడు.

''నా ఏకైక శత్రువు కథ ముగిసింది. నేనే ఇప్పుడు సుప్రీంని'' అంటూ ఎగిరి గంతేశాడు. మయూరితో పాటుగా అక్కడున్న సభ్యులంతా బిత్తరపోయి చూస్తున్నారు. నేను ప్రశాంతంగా గమనిస్తున్నాను.



ఉన్నట్లుండి శంతను ఆనందం ఆవిరైపోయింది. అతడి ముఖంలో అపనమ్మకం కొట్టొచ్చినట్లు కనబడింది. మా తాతయ్య శవం అదృశ్యమై విచిత్రజీవి అవతారమెత్తింది.

''మూర్ఖుడా!'' శంతను గావుకేక పెట్టాడు. ''ఏం మాయ చేస్తున్నావు నువ్వు? ఇతడు మీ తాతయ్య కాడా? అతడెక్కడున్నాడు? నువ్వు నన్ను వరుసగా ఏమార్చాలనుకుంటున్నావా?'' శంతను ముఖం ఆగ్రహంతో కంపించిపోయింది.

''నాకిప్పుడర్థమయింది. ముసలాయన నన్ను మోసగించాడు. నా పథకాన్ని మీరిద్దరూ కలిసి నాశనం చేశారు. ఎంత పెద్ద పథకం వేశాను నేను! ఇక్కడి ప్రాణులన్నింటినీ దోచుకోవాలని చూశాను. వీటి జన్యువులతో భూమ్మీద కొత్త ప్రాణులను సృష్టించి వాటిని నా బానిసలుగా చేసుకోవాలనుకున్నాను. ఈ బానిస ప్రాణుల సహాయంతో

భూమండలాన్నే ఏలాలనుకున్నాను. అయ్యో! నా కలలు కుప్పగూలిపోయాయి. కాని నిన్ను నేను వదిలిపెట్టను'' తీవ్ర ఆగ్రహంతో ఊగిపోతూ శంతను నామీద పడ్డాడు. లడ్డూ నాకు బాసటగా వచ్చి శంతను చేతిని గట్టిగా కరవడంతో అతడు నన్ను వదిలిపెట్టాడు.

ఈలోగా, మయూరి ఉగ్రనేత్రాలతో శంతను కేసి చూస్తూ దూషించింది. ''శంతను ఇదా నీ అసలు పథకం. తప్పుడు వాగ్దానాలతో నువ్వు మా అందరనీ మోసగించావే, నీకెంత ధైర్యం.'' శంతను ఒక్కసారిగా చల్లబడ్డాడు. నోరు జారి నిజం బయటపెట్టడం ద్వారా తప్పు చేసినట్లు గ్రహించాడు.

''మయూరీ! దయచేసి విను! వాస్తవంగా ఏం జరిగిందంటే..'' అంటూ చెప్పబోతుండగా ఆమె చెవులు మూసుకుంది.

''శంతనూ! మీ భూమికి తిరిగి వెళ్లిపో. ఇప్పుడే. పడవను తీసుకుని ఈ క్షణమే బయలుదేరు.

కొద్ది క్షణాలు ఆలస్యం చేసినా సరే ఈ జంతువులు నిన్ను ముక్కలు ముక్కలుగా చీరేస్తాయి. ఇకమీదట ఎన్నటికీ ఇక్కడికి రాకు.''- దాంతో కథ మొత్తం ముగిసిపోయింది.

భూమికి బయలుదేరడానికి పడవ సిద్ధంగా ఉంది. ఈ విచిత్ర ప్రాంతాన్ని వదిలివెళుతున్నందుకు మా మనస్సుల్లో వేదన. శంతను మాత్రమే వణుకుతున్నాడు. ఒమెన్ మమ్మల్ని సాగనంపడానికి వచ్చాడు.

''శివా! ఇప్పటికైనా రహస్యం ఏమిటో నాకు చెప్పకూడదా?''

''ఎందుకు చెప్పకూడదు? మీ వద్దకు నేను వచ్చినప్పుడు నాతో పాటు ఉన్నది తాతయ్య కాదు. విచిత్రజీవి. అది తన్ను తాను తాతయ్యగా రూపాంతరం చెందించుకుంది. శంతను నిరంకుశత్వం నుండి అది విముక్తి కోరుకుంది కాబట్టే మాతో సహకరించింది. మయూరి ఎదుట శంతను ముసుగు బయటపెట్టడంలో మేం విజయం సాధించాము.''

మయూరి మెల్లగా మేమున్న చోటకు వచ్చింది. ''నేను క్షమాపణలు కోరాలనుకుంటున్నా. శంతనును నేను నమ్మాను.'' పడవ మెల్లగా కదలసాగింది. మయూరి, ఇతరులు తమ చేతులు ఊపారు. మానవులకు అనునిర్వ తలుపులు శాశ్వతంగా మూసుకుపోతున్నట్లనిపించింది. శాశ్వతంగా మూసుకుపోతున్నాయి. నాకు చాలా విచారమేసింది.




-అయిపోయింది-

# కెరీర్ అంటే?



మనకు ఈ రోజు అందుబాటులో ఉంటున్న అవకాశాల వెల్లువలోకి వెళ్లడానికి ముందు, మన మార్గాన్ని మనం సరైన రీతిలో ఎంచుకోవలసి ఉంటుంది. దీనికి సులువైన ప్రణాళిక చాలు. మనం కొన్ని దశలను అనుసరించి వాటికి నిజాయితీగా కట్టుబడాలి. మొదటిదశ 'అంతర్గతం' కాగా, రెండోది 'బాహ్యం'

ఒక పెన్సిల్, ఒక కాగితం తీసుకుని కింది ఖాళీలు పూరించండి. కాగితం పై భాగంలో మీ పేరు రాసి కింది అంశాలు రాయండి.

అంతర్గతం

- అభిరుచి (నాకు ఇష్టమైనవి)
- సామర్థ్యం/నిపుణతలు (నాలో ఉన్న మరియు నేను మెరుగు పర్చుకోవలసిన నైపుణ్యాలు)
- విలువలు (నేను అనుసరిస్తున్న విలువలు, నీతులు, భావాలు)
- వ్యక్తిత్వం (నా గురించి, నా బలాబలాల గురించి నేను అర్థం చేసుకుంటున్న తీరు)
- లక్ష్యాలు (నేను విజయం సాధించాలంటే నేను ఏం చేయాలి, ఎలా చేయాలి?)
- ప్రాధాన్యతలు (నాకు ఏది ముఖ్యం - సంపద, అధికారం, ప్రతిపత్తి)

ఈ ఖాళీలను మీరు పూరిస్తున్నప్పుడు మీ వ్యక్తిత్వానికి, మీరు ఎంచుకున్న కెరీర్‌కు పొంతన ఉందో లేదో కాస్సేపు ఆలోచించుకోండి. ఉదాహరణకు, మీరు శారీరక శ్రమను ఇష్టపడనివారైనప్పటికీ పోలీసు అధికారి కావాలని అనుకుంటున్నట్లయితే వ్యక్తిగా మీకూ, మీ కెరీర్‌కూ పొంతన కుదరదు.

బాహ్యం

- అందుబాటులో ఉన్న అవకాశాలు:
- ఆ రంగంలో ఉపాధి అవకాశాలు, విద్యార్హతలు:
- కోర్సును ప్రతిపాదిస్తున్న విద్యా/వృత్తి సంస్థలు:
- కోర్సు డిగ్రీ లేదా డిప్లొమా కోర్సు. ఇది ఫుల్‌టైమ్ కోర్సు లేదా పార్ట్‌టైమ్ కోర్సు, ఇది రెగ్యులర్ లేదా కరెస్పాండెన్స్ కోర్సు.

ఏది సరైనది?

- అర్హతా ప్రమాణాలు:
- కోర్సు వ్యవధి, రుసుములు, ప్రవేశ ప్రక్రియ, ప్రవేశ పరీక్ష వగైరా.

మీరు భయపడకండి. ఈ జాబితా కొంచెం సంక్లిష్టంగా ఉంది కదూ! బాహ్యకారణాలను వచ్చే సంచికలో చర్చించుకుందాం. అంతవరకు మీరు అంతర్గత అంశాలను పరిశీలిస్తూ మీ ప్రాధాన్యతలు సరిగా ఉన్నాయో లేవో తేల్చుకోండి.

వచ్చే నెలలో కలుసుకుందాం.

– సాయి





# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

| English | It's the first day of school. | I had chappatis for dinner. |
|---|---|---|
| Telugu | పాఠశాలలో నాకిది తొలిరోజు. | చపాతీలే నా భోజనం. |
| Hindi | आज स्कूल का पहला दिन है।<br>ఆజ్ స్కూల్ కా పహలా దిన్ హై | मैंने रात के खाने में चपातियाँ खाईं।<br>మైనె రాత్ కె ఖానే మె చప్పాతియాన్ ఖాయేన్. |
| Tamil | இன்று பள்ளியின் முதல் நாள்!<br>ఇండ్రు పల్లియిన్ ముదల్ నాళ్ | நான் இரவு சப்பாத்தி சாப்பிட்டேன்.<br>నాన్ ఇరవు చప్పాతి సాపిట్టేన్ |
| Bengali | এটা স্কুলের প্রথম দিন।<br>ఎటా స్కూలర్ ప్రథమ్ దిన్ | আমি রাতে চাপাটি খেয়েছি।<br>అమి రాథి చప్పాతి ఖెయెచ్చే |
| Marathi | तो शाळेचा पहिला दिवस आहे.<br>తో శాలేచా పాహిలా దివస్ ఆహె. | जेवणात पोळ्या आहे.<br>జీవనాత్ పోల్యా ఆహె. |
| Kannada | ಇದು ಶಾಲೆಯ ಮೊದಲ ದಿನ.<br>ఇదు శాలెయ మొదల దిన. | ರಾತ್ರಿಯೂಟಕ್ಕೆ ನಾನು ಚಪಾತಿ ಸೇವಿಸಿದೆ.<br>రాత్రిఊటక్కె నాను చపాతి సేవిసిదే. |
| Oriya | ଆଜି ମୋର ସ୍କୁଲରେ ପ୍ରଥମ ଦିନ<br>ఆజి మొర స్కులరె ప్రథమ దిన. | ମୁଁ ଆଜି ରାତିରେ ରୁଟି ଖାଇବି<br>మున్ ఆఝి రాతిరె రుటి ఖాయిబి |
| Gujarati | તે શાળાનો પહેલો દિવસ છે.<br>టె షాళనో పహెలో దివస్ ఛే. | જમવામાં રોટલી છે.<br>జమవమాన్ రోతాలే ఛ్చె. |
| Assamese | আজি স্কুলৰ প্ৰথম দিন।<br>ఆజి స్కూల్-ఒర్ ప్రథొమ్ దిన్. | আজি ৰাতিৰ আহাৰত চাপাটি খালো।<br>ఆజి రాతిర్ ఆహారొత్ చపాతి ఖలు. |
| Malayalam | ഇന്ന് സ്കൂളിലെ ആദ്യത്തെ ദിവസമാണ്.<br>ఇన్ను స్కూలిలె ఆధ్యాత్తె దివసమన్ను. | അത്താഴത്തിന് ചപ്പാത്തി ആയിരുന്നു.<br>అథాజాతిను చప్పాతి ఆయిరున్ను. |
| Santali | ᱱᱚᱣᱟ ᱫᱚ ᱟᱥᱞᱟ ᱨᱮᱱᱟᱜ ᱯᱩᱭᱞᱩ ᱢᱟᱦᱟ।<br>నోవా దో అస్లా రెనగ్ పుయిలో మహా. | ᱴᱤᱠᱤᱱ ᱵᱟᱠᱷᱨᱟ ᱨᱩᱴᱤ ᱢᱮᱱᱟᱫ ᱛᱤᱧᱟ।<br>టికిన్ బాఖ్రా రుటి మెనద్ తింజా. |
| Sanskrit | अद्य शालास्य प्रथमं दिवसम् अस्ति।<br>అద్య శాలాస్య ప్రథమ్ దివసమ్ అస్తి. | अहम् रात्रि भोजने चपातय: अखादयम्।<br>అహమ్ రాత్రి భోజనె చపాతయః అఖాడమ్. |
| French | C'est le premier jour de l'école<br>సే లె ప్రీమియర్ జుర్ డె లెకోల్. | J'ai mangé le 'chapatti' pour diné<br>జె మోంఝె లె చపాట్టి పుర్ దినె. |
| German | Es ist der erste Tag der Schule.<br>ఎస్ ఇస్ట్ డెర్ ఎర్స్టె టాగ్ డెర్ షులె. | Ich hatte chappatis für das Mittagessen.<br>ఇష్ హాట్టె చప్పాటిస్ ఫ్యుర్ దస్ మిట్టాగెసెన్. |
| Spanish | Es el primer día de escuela.<br>ఎస్ ఎల్ ప్రీమియర్ దియా థె ఎస్కుయెలా. | Comi chappatis (pan) en cena.<br>కొమి చప్పాటిస్ (పాన్) ఎన్ సెనా. |





| English | I am going home. | I have dance class today. |
|---|---|---|
| Telugu | నేను ఇంటికి వెళుతున్నాను. | నాకు ఈ రోజు డ్యాన్స్ క్లాసు ఉంది. |
| Hindi | मैं घर जा रहा हूँ।<br>మైన్ ఘర్ జా రహా హూన్. | आज मेरी नृत्य की कक्षा है।<br>ఆజ్ మేరే నృత్య కి కక్షా హై. |
| Tamil | நான் வீட்டுக்கு சென்று கொண்டிருக்கிறேன்.<br>నాన్ వీట్టుక్కు సెంద్రు కొండిరుక్కిరేన్ | எனக்கு இன்று நடன வகுப்பு உள்ளது.<br>ఎనక్కు ఇంద్రు నడన వగుప్పు ఉళ్లధు |
| Bengali | আমি বাড়ি যাচ্ছি।<br>ఆమి బాడి జాచ్చి | আজ আমার নাচের ক্লাস আছে।<br>ఆజ్ అమార్ నాఛెర్ క్లాస్ అచ్చే |
| Marathi | मी घरी जातोये.<br>మీ ఘరి జాతోయె/జాటె. | आज माझी डांस क्लास आहे.<br>ఆజ్ మజి డాన్స్ క్లాస్ ఆహె. |
| Kannada | ನಾನು ಮನೆಗೆ ಹೋಗುತ್ತಿದ್ದೇನೆ.<br>నాను మనెగె హోగుత్తిద్దేనే | ನನಗೆ ಇಂದು ನೃತ್ಯ ತರಗತಿ ಇದೆ.<br>ననగె ఇందు నృత్య తరగతి ఇదె. |
| Oriya | ମୁଁ ଘରକୁ ଯାଉଅଛି।<br>మున్ ఘురక్కు జావచ్చి. | ଆଜି ମୋର ଡ୍ୟାନ୍ସ କ୍ଲାସ ଅଛି।<br>అజి మొక నాచ్చ క్లాస అచ్చి. |
| Gujarati | હું ઘરે જાઉં છું.<br>హున్ ఘరె జాన్ చ్ఛున్. | આજે મારી ડાંસ ક્લાસ છે.<br>ఆజె మారి డాన్స్ క్లాస్ ఛె. |
| Assamese | মই ঘৰলৈ যাওঁ।<br>మోయి ఘొరోలి జావో. | আজি মোৰ নাচ শিকাৰ ক্লাচ এটা আছে।<br>ఆజి మోర్ నాచ్ షికార్ క్లాస్ ఎటా ఆసె. |
| Malayalam | ഞാൻ വീട്ടിൽ പോകുന്നു.<br>న్యాన్ వెట్టి పొకున్ను. | ഇന്ന് എനിക്ക് ഡാൻസ് ക്ലാസ് ഉണ്ട്.<br>ఇన్ను ఎనిక్కు డ్యాన్స్ క్లాస్ ఉండు. |
| Santali | ᱚᱲᱟᱜ ᱤᱧ ᱥᱮᱱᱚᱜ ᱠᱟᱱᱟ।<br>ఒడగ్ ఇంజి సెనోగ్ కానా. | ᱛᱮᱦᱮᱧ ᱤᱧᱟᱜ ᱮᱱᱮᱡ ᱚᱠᱷᱟ ᱢᱮᱱᱟᱜ-ᱟ।<br>తెహెంజి ఇంజాగ్ ఎనెజ్ అఖ్లా మెనాగ్-అ |
| Sanskrit | अहम् गृहम् गच्छामि।<br>అహమ్ గ్రహమ్ గచ్చామి. | अद्य मम नृत्य कक्षा अस्ति।<br>అద్య మమ్ నృత్య కహాషా అస్తి. |
| French | Je rentre chez moi<br>జె రొంట్రె చె మ్వా. | J'ai la classe de danse aujourd'hui<br>జె లా క్లాస్ డె డేన్స్ ఒరుర్డివి |
| German | Ich gehe nach Hause.<br>ఇష్ గెహె నాఖ్ హౌస్. | Ich habe Tanzklasse heute.<br>ఇష్ హాబె టంకలాసె హ్యూటె. |
| Spanish | Voy a casa.<br>బోయ్ ఆ కస. | Hoy tengo clase de baile.<br>ఓయె టెంగో క్లాసె దే బాలె. |

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 19

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ – 19 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఆగస్ట్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. అక్టోబర్ 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భారతీయ సాహిత్యం!



1. గీతాంజలి రచనకు నోబెల్ బహుమతి గెల్చుకున్నది ఎవరు?
2. మొట్టమొదటి జ్ఞానపీఠ్ అవార్డ్ విజేత పేరు చెప్పండి?
3. ఆర్.కె. నారాయణ్ కథలు ఏ ప్రాంతం ఆధారంగా తయారయ్యాయి?
4. మరణానంతరం ఏ భారతీయ రచయిత పేరును ఒక నేషనల్ పార్క్‌కు పెట్టారు?
5. మేఘదూతం రాసినదెవరు?
6. పంచతంత్ర మూల కథలను రాసిందెవరు?
7. ది నైటింగేల్ ఆఫ్ ఇండియా అని ఎవరికి పేరు?

## చందమామ లోకజ్ఞానం క్విజ్-17 జూన్ 2010 సమాధానాలు

1. వినాయకుడు, 2. జయవిజయులు, 3. మత్స్యావతారం, 4. త్రేతాయుగం, 5. పుష్పక విమానం, 6. మోహిని, 7. అర్జునుడు, 8. విశ్వకర్మ

WINNERS: 1. N.V. Anjali, Hyderabad; 2. S. Jyotsna, Visakhapatnam; 3. Sampath, Tirupati; 4. N. Sapna, Karnataka; 5. O. Anirudh Krishna, Nelloor-2.

# తిండితిప్పలు లేకున్నా మనిషి బతకగలడు!




మనలో చాలామంది తిండిలేనప్పటికీ చాలా రోజులు బతకగలరు. నీళ్లు లేకుంటే మాత్రం, సగటు మనిషి 3 లేక 4 రోజులకు మించి బతకడం కష్టం. కాని, 82 ఏళ్ల సన్యాసి ప్రహ్లాద్ జ్ఞాని గత 74 ఏళ్లుగా తిండి, నీరు తీసుకోలేదంటే ఆశ్చర్యమనిపిస్తుంది కాని ఇది నిజం. ఈ సన్యాసిని పరిశీలిస్తున్న డిఫెన్స్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫిజియాలజీ, అల్లైడ్ సైన్స్ విభాగం సభ్యులు ఈ అరుదైన ఉదంతాన్ని చూసి నివ్వెరపోతున్నారు.

సంస్థ డైరెక్టర్ జి.ఇళవళగన్ ఇలా చెప్పారు. ''జ్ఞానిని 2003లో పది రోజులు పాటు మా ఆసుపత్రిలో పరీక్షించాము. న్యూరో ఫిజీషియన్ డాక్టర్ సుధీర్ షా అతడి బృందం జ్ఞాని నిజంగానే ఆహారపానీయాలు లేకుండా బతుకుతున్నాడా అని నిర్ధారించుకోవడం కోసం పరీక్షలు నిర్వహించారు. అంతే కాదు అతడు మూత్ర, మల విసర్జన కూడా చేయడం లేదు.''

జ్ఞాని కథపై తాము ఇంత ఆసక్తి చూపడానికి కారణాలను ఇళవళగన్ ఇలా చెప్పుకొచ్చారు. ''సరిహద్దులలో పనిచేస్తున్న మన సైనికులకు ఆహార పానీయాలు అంత సులభంగా లభ్యంకావు. జ్ఞాని శక్తికి ఆధారం ఎక్కడ ఉందో గుర్తించడానికి మేం ప్రయత్నిస్తున్నాం. ఆ శక్తిని సైనికులలోకి మార్చగలిగితే, లేదా ఏదో ఒకవిధంగా వారు దీన్ని వినియోగించుకోగలిగితే, మనకు చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ప్రకృతి వైపరీత్యాలు, తీవ్రమైన ఒత్తిళ్లతో కూడిన పరిస్థితుల మధ్య, భవిష్యత్తులో చంద్రుడు, అంగారక గ్రహం వంటి భూమికి అవతల ఉన్న ప్రాంతాలకు అంతరిక్ష యాత్రలు చేసే సందర్భాల్లో బతికి బట్టకట్టేందుకు వ్యూహాలు రచించడంలో ఇది సహాయకారిగా ఉంటుంది.''

కథ వరకు బాగానే ఉంటుంది, సన్యాసి చెబుతున్నది నిజమేనా అని నమ్మడానికి కొంచెం కష్టంగా ఉంటుంది కాని, అంతరిక్ష యాత్రలకు ఈ పరిశోధనా ఫలితాన్ని ఉపయోగించుకోవాలనుకోవడం నిజంగా మంచి ఆలోచన. హాలీవుడ్ త్వరలోనే ఈ సన్యాసిపై సినిమా తీస్తుందేమో ఎవరు చెప్పగలరు?

19

# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

చిత్రాలు: గాంధీ అయ్య

థార్విక్ కోరిక మేరకు మరొఘాను చంపడంలో ఆర్య తనకు సహాయం చేయవలసిందేనని ధర్మపిత చెప్పాడు. ఆర్య అందుకు ఒప్పుకున్నాడు. దాని ప్రకారం, ఆ ఇద్దరూ కలిసి థార్విక్‌ను సంతృప్తి పర్చడంకోసం మరొఘాను ''చంపేశారు''

పిల్లలు ఎక్కడ ఉన్నారు?

థార్విక్ జంతువుల పరుగులతో అడవి ప్రతిధ్వనిస్తోంది.

నువ్వు వాళ్లనేం చేశావు?

ఊరకే గోల పెట్టవద్దు! వాళ్లు త్వరలోనే మేలుకుంటారు.

వాళ్లను నిద్రమత్తులో ఉంచాను. దాని ప్రభావం పగటి పూట చెదిరిపోతుంది.


నేనిక
బయలుదేరాలి.
మా తండ్రి నాకోసం
వేచి చూస్తుంటాడు.


మరీఘా...
ఆమె బాగానే
ఉందా?


ఆమెకేం కాదు. ఆమె
ఇకపై తోడేలు రూపంలోకి ఎన్నటికీ
మారలేదు. ఆమె ఆ శక్తిని శాశ్వతంగా
వదిలేసుకుంది.


కానీ, ఆమె
ఇప్పుడు
ఎక్కడుంది?


ఈలోగా, థార్విక్.. సలూంకీని
కలుసుకోవడానికి సల్గాజీ వైపు వెళ్లాడు.
తోడేలు కళేబరాన్ని అతడికి ఇచ్చాడు.


నా బంగారూ! నిన్ను చూసి గర్వపడుతున్నాను! నీవే ఇక మాణిక్యానికి ఏకైక వారసుడివి!




కళేబరాన్ని దహనం చేయడం కోసం
సలూంకీ చితిని సిద్ధం చేస్తున్నాడు.


కళేబరాన్ని సలూంకీ మంటల్లో విసరబోతూ తోడేలు పసుపు
పచ్చ కళ్లు పూర్తిగా తెరచుకుని ఉండటం గమనించాడు.




వాళ్లు నిన్ను ఏమార్చారు.


ఇది మరీఘాయే. నా కళ్లారా నేను ఆ దృశ్యాన్ని చూశాను!
ఇది దాని బాహ్య రూపం మాత్రమే. దాని కళ్లు ఇప్పటికీ ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి చూడు.
అయితే?
అంటే, తోడేలు రూపం వదులుతున్నప్పుడు, ఆమె సజీవంగా ఉంది. ఆమె కళ్లు ఇప్పటికీ జీవశక్తితో మెరుస్తున్నాయి.
ప్రశాంతంగా ఉండు. ఇప్పుడు మనముందు ఒకే దారి ఉంది.
నీవు సుకన్యను తప్పకుండా బంధించాలి.
ఇంకా ఉంది.

# యురేకా

## పెన్సిల్–ఫ్యాన్

ఈ అద్భుతమైన బొమ్మ ఒక చెక్కిన పెన్సిల్‌పై ఉండే ప్రొఫెల్లర్. ఇది పనిచేసే లేదా తిరిగే విధానం గత నూరేళ్లుగా ప్రజలను ఆశ్చర్యానికి గురి చేస్తోంది.





**కావలసినవి:**

- ఒక కొన రబ్బర్ ఉన్న పెన్సిల్
- మందంగా ఉండే కార్డు షీట్
- ఐస్ క్రీమ్ పుల్ల





## ఎలా చేయాలి?

- కత్తి లేదా త్రికోణ ఫైలు ఉపయోగించి పెన్సిల్‌పై 5 – 6 చోట్ల లోతుగా కోయండి.
- మందపాటి కార్డు షీట్ ముక్క నుండి 3 – 1.5 సెంటీమీటర్ల పొడవైన దీర్ఘచతురస్రాకారపు ప్రొఫెల్లర్‌ను కట్ చేయండి. ఈ ఫ్యాన్ మధ్యలో ఒక రంధ్రం పెట్టండి. పిన్ను వదులుగా ఉండేంత పెద్ద రంధ్రం చేయాలి.
- ప్రొఫెల్లర్ రంధ్రం గుండా పిన్నును చొప్పించి, దాన్ని పెన్సిల్ కొసలో ఉన్న రబ్బర్‌కు అమర్చండి.
- చెక్కిన పెన్సిల్ భాగాన్ని మీ చూపుడువేలుతో, పెన్సిల్ దగ్గరి భాగాన్ని మీ బొటనవేలుతో పట్టుకోండి. ఐస్ క్రీమ్ పుల్లను (లేదా పాత రీఫిల్)తో పెన్సిల్ మీది గాట్లపై వెనుకా ముందుకు తట్టండి.
- ప్రొఫెల్లర్ ఒక దశలో తిరుగుతుంది. ఇప్పుడు మీ చూపుడు వేలును సడలించి మీ బొటనవేలుతో పెన్సిల్‌ని నొక్కి పట్టుకోండి. ఇలా చేసే క్రమంలో పుల్లను వెనక్కు, ముందుకు తడుతూ ఉండాలి. ఇప్పుడు ప్రొఫెల్లర్ వ్యతిరేక దశలో తిరుగుతుంది.

**భావన:** ఈ బొమ్మ ప్రకంపనలపై పనిచేస్తుంది. పెన్సిల్ మీది అడ్డు మరియు నిలువు ప్రకంపనలు ఒకే పౌనఃపున్యం మరియు స్థితితో ఉండవు. పెన్సిల్ మీది ప్రకంపన చలనం దానివల్ల పిన్ మీది ప్రకంపన చలనం దీర్ఘవృత్త చలనంలో ఉండవు. ప్రకంపిస్తున్న పిన్ మరియు ప్రొఫెల్లర్ మధ్య ఘర్షణ వల్ల ప్రొఫెల్లర్ చలనంలో ఉంటుంది. వేలి ఒత్తిడి, అది నొక్కిపట్టుకున్న భాగంపై అధారపడి, ఈ దీర్ఘ వృత్త చలనంలో లేని ప్రకంపనలు సవ్యదిశలోనూ లేదా అపసవ్య దిశలోనూ ఉంటాయి.

రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ – యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)



# నవ్వుల పువ్వులు



తల్లి తన ముఖానికి ఉన్న క్రీమును తీసివేయడం రక్షిత చూసింది.

రక్షిత: ఏంటమ్మా అది?

తల్లి: ఇది నన్ను మరింత అందంగా తీర్చిదిద్దుతుందే!

రక్షిత: అది పనిచేస్తున్నట్లు లేదమ్మా!



సమర్: మీ నాన్న టీచర్ కదా. మరి మీ పెద్దక్కయ్య అక్షరముక్క కూడా చదవలేదేంటీ అమర్?

అమర్: అయితే ఏంటట? మీ నాన్న దంతవైద్యుడు కదా, మరి మీ చిన్న తమ్ముడికి ఒక పన్ను కూడా లేదేంటి?



టీచర్: లెక్కల్లో నీకు ఎనభైయొక్క మార్కులిచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉందిరా

మనీష్: నాకు నూటికి నూరు మార్కులు వేసి ఉంటే మీరు ఇంకా సంతోషించి ఉండేవారు కద టీచర్?




దత్తూ, ఫుట్‌బాల్ ఆడేందుకు ట్యూషన్ క్లాస్ ఎగ్గొట్టావా?

లేదు, నేనెగ్గొట్టలేదు నాన్నా!

నీ మాటలను ఎలా నమ్మాలి రా..?

ఇదిగో సాక్ష్యం. మామయ్య తోటలోంచి మామిడి పళ్ళు కొట్టుకొచ్చాను.



జాన్: మీ చేయి మీరే ఎలా విరగ్గొట్టుకున్నారు?

మైఖేల్: నా వైద్యుడి ప్రిస్క్రిప్షన్‌ని అనుసరించాను.

జాన్: ప్రిస్క్రిప్షన్‌ని అనుసరిస్తే.. మీ చేయి ఎలా విరగ్గొట్టుకున్నారు?

మైఖేల్: అది కిటికీ గుండా అవతలకు పోయింది. నేనూ దాన్ని అనురించానంతే..

**కార్యకలాపాలు**

## దాగుడుమూతలు

చిత్రంలో దాగి ఉన్న చేపలను లెక్కించండి.



# వృక్షాల పేర్లు

ఒక నిర్దిష్ట థీమ్‌లో మీరు ఆల్బమ్ రూపొందించడానికి, కింద ఇచ్చిన చిత్రాలను ఉపయోగించవచ్చు. ఈ నెల అంశం 'చెట్లు'


















CHANDAMAMA (Telugu) August 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బబ్బా జట్టు సాహసాలు



మహేష్, అతడి మిత్రుడు తేజస్ టీవీలో ఫుట్‌బాల్ మ్యాచ్ చూస్తున్నారు. ఫుట్‌బాల్ ఆటను చూస్తున్నప్పుడు కూడా అతడు ఓడిపోయే జట్టు పక్షాన ఉండటాన్ని వ్యతిరేకిస్తాడు.



ప్రతి మ్యాచ్‌లోనూ మహేష్ గెలిచే జట్టుకు పెద్ద మద్దతుదారుగా ఉంటాడు.




క్వీన్స్ మెన్ జట్టు ఓడిపోయినప్పుడు కొత్త జట్టుకు మద్దతు ఇవ్వడానికి అతడు ఏ మాత్రం వెనుకాడడు.



చూడు, నా జట్టు గెలువబోతోంది.




ఆ జట్టు ఓడిపోయినప్పుడు కూడా, మహేష్ పెద్దగా బాధ వ్యక్తం చేయడు.




స్పెయిన్ జట్టుకు మద్దతు ప్రకటిస్తున్నందుకు నేను గర్విస్తున్నాను.




అతడి స్నేహితుడు తేజస్ దీన్ని అర్థం చేసుకోలేకపోయాడు.




మహేష్ స్టయిల్‌గా చిరునవ్వు నవ్వాడు.






ఫుట్‌బాల్ మస్తీ!

